# వైకుంఠ భవనం

(నాటకం)




కొడాలి గోపాలరావు



# వైకుంఠభవనం

(నాటకం)

రచన:

కొడాలి గోపాలరావు



ఉదయ సాహితి పబ్లికేషన్స్

విజయవాడ-1

ఉదయసాహితీ ప్రచురణ

ప్రథమ ముద్రణ

అక్టోబర్ '60





వెల : రు. 1-50



ముద్రణ :
శ్రీ శారదా ప్రెస్,
విజయవాడ-2.



సంపాదకులు :
పి. అర్జునస్వామి.

# ఇందులోని పాత్రలు

ధర్మన్న
వెంకన్న
వైకుంఠం
సేట్
శివకాసి
సదానందం
దుర్గారావు
దామోదరం
వెంకటేశం
సుధాకర్
డాక్టర్
మాధవయ్య
సబ్ ఇన్‌స్పెక్టర్
సుజాత

కాలం: వర్తమానం.

# గమనిక

ఈ నాటకంను సంబంధించిన ప్రింటింగ్ పబ్లిషింగ్ హక్కులు ఉదయసాహితీ పబ్లికేషన్స్, విజయవాడ-1 వారికీ, మిగిలిన రేడియో, స్క్రీన్, స్టేజ్ వగైరా హక్కులు కొడాలి గోపాలరావు, పెదరావూరు పోష్టు, తెనాలి తాలూకా వారికీ చెందివున్నవి. గనుక ప్రదర్శించ దలచినవారు రచయిత అనుమతిపొంది ప్రదర్శించవలెను.

# వైకుంఠ భవనం

## మొదటి రంగం

(ధర్మన్న గృహం. ముందు వరండా ఒక మంచం. ప్రక్కనే ఓ పాత గుడ్డలు ఆరవేసిన దణ్ణెం వగైరా వుంటై. లోపలనుండి మూలుగు, దగ్గు, బాధ పడుతున్న ధ్వని వినిపిస్తుంది. సుజాత ఆత్రుతగా లోపలినుండి బయటి కొస్తుంది. వయస్సు 16 సం॥ లు వుంటై. నేతచీర, వాయిల్ జాకెట్టు వేసుకొని ఉంది. తలవెంట్రుకలు రేగివుంటాయి ముఖంలో విషాధం కన్పిస్తూ ఉంది. ధర్మన్న మందుల సంచితో ప్రవేశిస్తాడు. వెనుకనే డాక్టరుకూడ వస్తాడు.)

ధర్మన్న :- ఎలా ఉందమ్మా మీ అమ్మకు ?

సుజాత: వెక్కిళ్ళు వస్తున్నాయి. వెఱ్ఱిచూపు చూస్తోంది. మాట్లాడడంలేదు.

డాక్టరు: భయపడకమ్మా! ఏం ఫరవాలేదు.

ధర్మ: పదమ్మా! పద!

(లోపలి కెళ్ళారు. లోపల సుజాత ఏడుస్తూన్న ధ్వని...)

డాక్ట: (తెరలోపల) ష్ ... అలా ఏడిస్తే ఎలాగమ్మాయ్ ? ఊరుకో !

ధర్మ: (తెరలోపలే) ఊరుకో తల్లీ ! వూరుకో !

సుజా : (తెరలోపలే) నాన్నా ! (ఏడ్పు)

ధర్మ: (లోపలనుండి బయటకొచ్చాడు. పిచ్చెత్తిన వాడిలా అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు.)

(లోపల)

డాక్ట : అమ్మాయ్ ! కాసిని వేడినీళ్ళు అందుకోమ్మా !
ధర్మ : (బయట మంచంమీద కూర్చొని బాధగా తలపట్టు కుంటాడు )
(డాక్టరు ముందు బయట కొచ్చాడు. వెనుక సుజాత వచ్చింది ధర్మన్న డాక్టర్ను చూచి మంచంపైనుండి లేచి ఆదుర్దాగ )
ధర్మ : ఎలావుంది డాక్టరుగారూ ? ప్రమాదం లేదుకదా ? చెప్పండి.
డాక్ట : (టైముచూచి) ఆరుగంటలు గడిస్తే బ్రతకొచ్చు.
ధర్మ : అంటే ఈలోపల...?
డాక్ట : చెప్పలేం ! పరిస్థితి చాల ప్రమాదంగా వుంది.
సుజా : (సంచిని డాక్టరుచేతి కందించి ముఖానికి చేతులడ్డు పెట్టుకొని ఏడుస్తూ లోనికి పరిగెత్తింది) అమ్మా !
ధర్మ : అంతేనా డాక్టరుగారు ! అంతేనా ? నా భార్యను బ్రతి కించలేరు ? నా కుటుంబాన్ని నిలబెట్టలేరు ? ... నా యిల్లు......
డాక్ట : ధర్మన్నా ! నేచేయగలిగిందంతా చేశాను. కాని.
ధర్మ : చెప్పండి బాబూ ! ఏంచేయమంటారు ? ఏం కావా లంటారు ?
డాక్ట : ఆమెకు ఇంజక్షన్లు కావాలి. అందుకు డబ్బు కావాలి !
ధర్మ . (నిట్టూర్చి) డబ్బు కావాలి ! డబ్బు ! ఎక్కడ తెచ్చేది ?
డాక్ట : సరే చాలబాగుంది. ఈ రాత్రికి కనీసం 10, 15 ఇంజె క్షన్లన్నా ఇవ్వాలి. లేకపోతే ఆమె బ్రతకదు. చాల ప్రమాదంలో వుంది. తరువాత నీయిష్టం.

ధర్మ : నాచేతిలో కానీలేదు. వచ్చేమార్గం అంతాకన్నా లేదు.

డాక్ట : సరే నాకు టైమ్ అయింది. నా విజిటింగ్ ఫీజు ఐదు రూపాయలు......?

ధర్మ : ఐదు కానులైనా లేవు బాబు. నెమ్మదిగా ఇచ్చుకుంటాను. ఈసారికి నన్ను వొడ్డున వెయ్యండి.

డాక్ట : నాన్సెన్స్ ! ప్రతివాళ్ళకు ఇదొక పాటైపోయింది. అంత ఇవ్వలేనివాళ్లు డాక్టర్లను యిళ్ళకెందుకు రప్పించుకోవాలి ? డాక్టరొస్తే ఫీజు యివ్వాలని తెలీదూ ?

ధర్మ : తెలుసు బాబూ ! తెలుసు ! తెలీకకాదు. డబ్బులేక.

డాక్ట : అవునుమరి. డాక్టర్ల కిచ్చేందుకు డబ్బుండదు. తాగుడుకు, బ్రాకెట్లకైతే డబ్బుంటుంది. ( అని వెళ్ళబోయాడు.)

ధర్మ : (డాక్టర్ కాళ్ళమీదపడి) డాక్టరుగారూ యీసారికి... యీసారికినన్ను వడ్డునవెయ్యండి. మీకు జీవితమంతా చాకిరీచేస్తా! మీవద్ద నౌకరీ చేస్తా! మీ ఋణం వుంచుకోను నా భార్యను బ్రతికించండి.

డాక్ట : ధర్మన్నా! నేనింతకన్న నీకేమి సహాయం చేయలేను. నన్ను బాధపెట్టకు. ఇదిగో ప్రిస్కిప్షను వ్రాసియిస్తాను. ఇంజక్షను తెచ్చుకో (చీటి వ్రాసి యిస్తాడు.)

ధర్మ : (చీటీ అందుకొని) బాబూ ! ఏమాత్రం ఖరీదౌతుంది ?

డాక్ట : కనీసం యాభై రూపాయలు అవుతుంది.

సుజా : (లోపలనుంచి వస్తుంది).

ధర్మ : యాభై రూపాయలే...?

సుజా : నాన్నా ! అమ్మ ... అమ్మకు కాళ్ళు, చేతులు చల్ల బడుతున్నై నాన్నా !

ధర్మ : (విచారంగా) ఏంచేస్తాంతల్లీ ! మనం దరిద్రులం. మనకు మందులు, మాకులు దొరకవు. ఈ రోగాలు నయం కావు. మనం అమ్మను బ్రతికించుకోలేము.

సుజా : అంతేనా నాన్నా ! అంతేనా ! (డాక్టరుతో) డాక్టరు గారూ మా అమ్మను బ్రతికించండి. మీకు పుణ్య ముంటుంది.

డాక్ట : నాకు పుణ్యం పాపం అక్కర్లేదు. మీరు డబ్బుతెచ్చు కొని ఇంజెక్షన్ తెచ్చుకుంటే నేను వైద్యం చేస్తాను. లేకపోతే నాచేతగాదు. ఇప్పటికి మీమాటలు నమ్మి వచ్చి నా విజిటింగ్ ఫీజు నష్టపడ్డాను. టైముకూడ వేస్టు! వస్తా ! (వెళ్ళిపోయాడు)

సుజా : నాన్నా డబ్బుకోసం ఎక్కడికన్నా వెళ్ళిరానాన్నా ! ఎవర్నన్నా అడిగిరా నాన్నా ! అమ్మకు ప్రాణం పోతుంటే అలా చూస్తావేం నాన్నా (ఏడ్చింది)

ధర్మ : పిచ్చితల్లి. మీ అమ్మప్రాణం పోతుంటే ఎవరికి జాలమ్మా ! మనకు ఆత్మీయులు, ఆదుకొనే వాళ్లు ఎవరూ లేరమ్మా ! ఈనాలుగు గోడలమధ్య కుళ్ళినా, ఏడ్చినా, చచ్చినా ఎవ్వరికీ జాలి లేదు.

సుజా : పోనీ నీకు తెలిసిన వాళ్ళెవరైనా ఉంటే అడుగునాన్నా! వెళ్ళు నాన్నా !

ధర్మ : నాకెవళ్ళూ తెలిసినవాళ్ళు లేరమ్మా ! ఒకళ్ళిద్దరున్నా వాళ్ళదగ్గర ఇదివరకే అప్పులుచేశాను

సుజా : అవును. చేశావు. ఎందుకు ? నీ త్రాగుడుకు...నువ్వు త్రాగడానికైతే అందరు స్నేహితులు దొరుకుతారు. అన్ని అప్పులు పుడతాయి. నీకు జాలిలేదు. దయ లేదు. హృదయంలేదు. డబ్బున్న నాల్గురోజులు త్రాగి తలకుపోసుకొని సంసారమంతా గుల్లచేశావు. నాశనం చేశావు. అమ్మ జబ్బున పడటానికి, యీరోజున నీచేతిలో కానీ లేకుండా పోవటానికి నువ్వే కారణం.

ధర్మ : సుజాతా ! (కొట్టబోయి ఆగాడు).

సుజా : కొట్టునాన్నా ! కొట్టు !...చంపు...మేమంతాచస్తాం! నువ్వే సుఖంగా ఉండు. (లోనికి వెళ్ళిపోతుంది. ధర్మన్న బయటకు వెళ్ళిపోతాడు. సుజాత మేనమామ వెంకటేశం వస్తాడు. చేతిలోసంచి మంచమ్మైవేసి, మంచం మీద కూర్చుంటాడు. దగ్గుతాడు. సిజాత లోపలినుండి వస్తుంది.)

సుజా : ఎంతసేపయింది మామయ్యా వచ్చి ?

వెంక : నేను రావటం పొద్దునే వచ్చాను. మొన్న ఫ్యాక్టరీకి ధాన్యంతోలాం ఆ డబ్బు తీసుకెళదామని వచ్చాను. సరేగాని నువ్వలావున్నావేం ?

సుజా : అమ్మకు చాల ప్రమాదంగావుంది మామయ్యా ! చావు బ్రతుకుల్లో వుంది.

వెంక : అయ్యో పాపం ! అలాగా ! మరేం మందూ, మాకు యిప్పించలా ?

సుజా . లేదు.

వెంక : ఏం ?...ఎందుకని ?

సుజా : డబ్బు లేక.

వెంక : డబ్బు లేకపోతే మందు మానేస్తారా! ఎక్కడన్నా అప్పో సొప్పో చేసి మనిషిని బ్రతికించాలి గాని ఆ ... మీ నాన్నెక్కడ ?

సుజా : ఎక్కడికో వెళ్ళాడు.

వెంక : అసలాయనకు యింత ప్రమాదంగ ఉన్నట్టు తెలుసా ?

సుజా : ఆ... తెలుసు...వచ్చి నువ్వన్నా చూడుమామయ్యా! నాకు భయంగావుంది.

వెంక : భయమెందుకు ? ఆ పద. (వెంకటేశం సుజాత లోపలికెళ్ళారు. తిరిగి రెండు సెకండ్లలో బయటికి వచ్చి)

వెంక : మీ నాన్నకు సంపాదించే రోజుల్లో కళ్ళు కనపళ్ళా. ఇష్టమొచ్చినట్లు త్రాగి తందనాలాడి యిప్పుడు ఏడిస్తే ఏం లాభం ?

సుజా : మామయ్యా! నీదగ్గర డబ్బేమైనా వుందా ? అమ్మకు ఇంజక్షన్లు కావాలి. కనీసం యాభై రూపాయలు కావాలన్నాడు డాక్టరు. లేకపోతే అమ్మ చచ్చిపోతుందట.

వెంక : ఆ...డాక్టర్లు డబ్బుకోసం అలాగే చెప్తారు.

సుజా : అదికాదు మామయ్యా! నువ్వు చూడలేదు. అమ్మకు నోటమాట లేకుండా పోయింది.

వెంక : అబ్బే! నాదగ్గర డబ్బేమీ లేదు. ఈ రాత్రికి హోటలుకు డబ్బులేక మీయింటికొచ్చాను. ఉంటే ఇవ్వను. నీకొద్దంటానా ?

సుజా : పోనీ నీకు తెలిసినవాళ్ళుంటే అప్పు తేలేవ్ ? నీకు చాల పలుకుబడివుంది. నువ్వడిగితే ఎవ్వరూ కాదనరు.

వెంక : పలుకుబడితో డబ్బును ఎక్కడా పొందలేనమ్మాయ్! నేను నా అవసరాలకే ఎవడ్నీ అప్పడగను. వాళ్ళు లేదంటే తల కొట్టేసినంత పనౌతుంది.

సుజా : ఇంత ప్రాణాపాయస్థితిలో కూడ నీవట్లా నియమాలు పెట్టుకుంటే ఎట్లా మామయ్యా! మీరు కాకపోతే యింకెవ్వరు చూస్తారు ?

వెంక : చూడాల్సిందే. ఏం చెయ్యను? ఇంటి కెళ్లేందుకు కారుకూ్కడా డబ్బుల్లేవు. అదే ఆలోచిస్తున్నా సరే నే వస్తానమ్మా! ధైర్యంగావుండు. దిగులుపడకు. దేవుడు న్నాడులే! (లేచి సంచితీసుకొని, చెప్పులు తొడుగు కొని యీదమరచి తలగుడ్డతీసి భుజాన వేసుకున్నాడు. తలగుడ్డలో నోట్లకట్టలు క్రిందపడతాయి. చూచి గభా లునతీసి జేబులో వేసుకొన్నాడు. సుజాతవంక చూచి, ఆమె చూచినట్లు గ్రహించి కొంచెం కంగారుపడుతూ) మన రామయ్యబావ తాలూకాలో కట్టేరమ్మన్నాడు. ఇక్కడికొచ్చే సరికి తాలూకాటైము దాటిపోయింద న్నాడు ఆ షరాబుగాడు. ఇదొక పాడు పెంటైపో యిందినాకు. తీసికెళ్లి వాడి మొఖాన్నే పారేస్తా! ఇత రులపనులు నెత్తినవేసుకుంటే ఇదే బాధ! అమ్మాయ్! ఈ డబ్బు నాదనుకొనేవ్ కొంపతీసి. ఆ ... వస్తామరి. మీ నాన్నతో చెప్పు అమ్మను జాగ్రత్తగా చూచుకో. ఒక ఉత్తరంముక్క రాసిపడెయ్యి నేను వస్తాను (వెళ్లి పోయాడు.)

(సుజాత స్థాణువులా నిలబడిపోయింది. కాసేపాగి లోప
లకు వెళ్లిపోయింది. వైకుంఠం ప్రవేశించాడు. చేతిలో
పళ్లు, పూలు ఉన్నాయి. చేతిలో బెత్తం. దానితో
మంచంమీద మూడుసార్లు కొడతాడు. సుజాత
వచ్చింది )

వైకుం : ఆ చూడమ్మాయ్ ? మీనాన్న లేడు ?

సుజా : లేరండి.

వైకుం: ఎక్కడికి కెళ్లాడో ?

సుజా : అలా బజారుకు వెళ్లుంటారు.

వైకుం: ఇప్పుడొస్తారా...?

సుజా : రావచ్చు

వైకుం: (మంచంమీద కూర్చొని, సుజాతను నకశిఖపర్యంతం
చూచి నవ్వుతూ) మీనాన్నగారొచ్చేవరకు నేనిక్కడే
కూర్చుంటాను. మీకు అభ్యంతరము లేదుగా. ఆయ
నతో నాకు చాల అర్జంటు పనులున్నై. నువ్వు నన్ను
ఎప్పుడూ చూడలేదు. ఆఁ ఇప్పటి మాటా! పది
సంవత్సరాల నాటిమాట. అప్పుడు చాలా చిన్న
దానివి నేను నీకు బొమ్మలుకూడా కొనిచ్చేవాడిని.
మీ నాన్న నేనూ ప్రాణస్నేహితులం.

సుజా : (మాటల్లోని అర్థం తెలియక బాధపడుతుండాలి).

వైకుం: ఆ...చూడమ్మాయ్ ! కాసిని మంచినీళ్లందు
కుంటావ్ ?

సుజా . (మాట్లాడకుండా లోపలికి వెళ్లిపోతుంది.)

వైకుం: (ఇల్లంతా కలయచూస్తూ ఉండాలి.)

సుజా : (మంచినీళ్ళ గ్లాసుతో వచ్చి వైకుంఠానికిస్తుంది.)

వైకుం: (త్రాగి గ్లాసు అందిస్తూ) ఆహా ! అమృతంలాగవున్నై మన నూతిలో నీళ్లేనా ?

సుజా : (సిగ్గు, కోపం, విచారం అభినయిస్తూ లోపలికి వెళ్ళిపోబోవలెను.)

వైకుం: చూడమ్మాయ్ ! ఈ పళ్ళూ, పూలు లోపలకు పట్టుకెళ్లు.

సుజా : అవెందుకండి మాకు ? మా అమ్మ......

వైకుం: (ఆశ్చర్యంగా) ఆ, మీఅమ్మ ఏమిటి ? ఏం జరిగింది చెప్పు...

సుజా : చాల జబ్బుగావుంది. చావు బ్రతుకల్లో వుంది.

వైకుం: అరెరె అలాగా ? ఇందాకట్నుంచీ చెప్పావు కావేం ? పద ! (లోపలి కెళ్లాడు.)

సుజా : (అక్కడే నిలబడి ఉంది.)

వైకుం. (తిరిగివచ్చి ఆదుర్దాగా) అయితే మందేమన్నా ఇప్పిస్తున్నారా ?

సుజా : ఆ...!

ధర్మ : (తూలుతూ, పాడుతూ వచ్చాడు.)

వైకుం: (ఒకవైపుకు వెళ్ళాడు.)

సుజా : నాన్నా ! నాన్నా ! ఇదేమిటి నాన్నా ?

ధర్మ : (నవ్వి) నాన్న...నేను నీకు...? (ముఖంలో ముఖం పెట్టి చూశాడు. సుజాత భయపడింది.)

సుజా : అమ్మకు ప్రాణంమీదకొస్తే నువ్వు త్రాగివొచ్చావా? మందేది ?

ధర్మ : మందూ లేదు. మట్టీ లేదు. నువ్వూ లేవు—నేనూ లేను—
అమ్మా లేదు—ఆలీ లేదు. పిచ్చిదానా ! ప్రపంచంలో
యివన్నీ స్థిరమనుకుంటున్నావ్ ? ఏదిస్థిరం ?
ఏమిజన్మం యేమిజీవనము
ఈ మాయకాయం బేమిజీవనము
ఏమిజన్మం బేమిజీవనమేమి యీ ప్రారబ్ధకర్మం
స్వామిఏన్నిట జేసిమరచెను.

సుజా : ఏమిటినాన్నా! ఈపాడు వేదాంతం? అవతల అమ్మకు
ప్రాణం పోతుంటే!

ధర్మ : అమ్మ!...అమ్మమీాద నాకు లేని ప్రేమ నీకెందుకే...?

సుజా : (నివ్వెఱపోతుంది.)

వైకుం : ధర్మనాన్న మంచిధర్మమే నేర్చుకున్నావ్?

ధర్మ : ఎవరది?

వైకుం : నేను వైకుంఠాన్ని!

ధర్మ : ఓకిపిచ్చినాగన్నా! వైకుంఠం భూమ్మీాద వుంటుందిరా?
(కళ్ళలో కళ్ళుపెట్టి) డాక్టరువా... కలెక్టరువా?
...ఎవరవోయ్! నిజంచెప్పు.

వైకుం : నిషా బాగా ఎక్కినట్టుందే? ఏమాత్రం పుచ్చుకున్నా
వేంటి?

ధర్మ : ఎవరు...వైకుంఠం...నువ్వు నువ్వు... (పిచ్చివానిలా
పైకిచూస్తూ అతనికి తెలియకుండానే పెదవులు
కదుల్తాయి.)

వైకుం . అవును నేనే!

ధర్మ : ఎందుకొచ్చావ్? ఎందుకొచ్చావ్ ఇక్కడికి? నిన్నెవరు రమ్మన్నారు?

వైకుం: నేనే! నువ్వు కష్టాల్లో వున్నావనివిని కడుపుండ బట్టక పరుగెత్తుకొచ్చానోయ్!

ధర్మ : నువ్వేమీ చేయనక్కర్లేదు.... వెళ్ళు... వెళ్ళు... వెళ్ళవేం?

వైకుం: (నవ్వుతాడు)

సుజా : అదేమిటినాన్నా! ఆయనెవరు?

ధర్మ : ఎవరో నీకెందుకు? (వైకుంఠంతో) అసలు నువ్విక్కడ కెందుకొచ్చావ్? నువ్విక్కడ ఉండకూడదు. వెళ్ళు. (సుజాతతో) రా...రామ్మా! లోపలికిరా!

సుజా : అదేమిటినాన్నా! ప్రేమగా యింటికొచ్చిన వాళ్ళను అవమాన పరుస్తావు మంచీ చెడ్డా తెలీదు.

వైకుం : (నవ్వి) ఊరుకోఅమ్మాయ్! అననీయ్ ఆయన నన్ననక ఇంకెవర్నంటాడు? చాలారోజులు కనపడలేదని వచ్చిన కోపం.

ధర్మ . అదుగో! ఆదొంగ ప్రేమలే నటించొద్దని నీకు చెప్పింది. తడిగుడ్డలతో గొంతుకోసేవాడివి. రాక్షసుడివి. క్రూరుడివి. దుర్మార్గుడివి. దగాకోరువి.

వైకుం: ఆహ్హాహ్హా! ఎంత ఆవేశపడుతున్నావోయ్ ధర్మయ్యా! ఆ...చూశావా అమ్మాయ్! మరీ మతిభ్రమిస్తోంది. మీనాన్నకు.

సుజా : ఏమండీ మీరేమీ అనుకోకండి. మా అమ్మకు జబ్బు ఎక్కువగావుంది! అందుకని మానాన్న పూర్తిగా

తాగొచ్చాడు. ఏదేదో మాట్లాడుతున్నాడు.

ధర్మ : ఏమన్నావ్? (అని సుజాతను కొట్టాడు. కొట్టిన వెంటనే చెయ్యిపట్టుకుని లోనికి తీసుకెళ్ళాలని ప్రయత్నించాడు. సుజాత ముఖంలోకి చూచి ఏడుస్తున్న సుజాతను చప్పున హృదయానికి హత్తుకొని పొంగి పొరలివస్తున్న దుఃఖంతో) అమ్మా!

సుజా : నాన్నా! (ధర్మన్న ముఖంలోకి చూస్తుంది.)

ధర్మ : ఈ పాడుచేత్తో కొట్టానునిన్ను. నేను క్షుద్రుడిన్ని. నీచుణ్ణి. దుర్మార్గుడిని త్రాగుబోతుని.

సుజా : (జాలిగా) నాన్నా! అలా అనకు నాన్నా!

ధర్మ : అమ్మా నేను నీకునాన్నను...నాన్న...నాన్న...

వైకుం: ధర్మన్నా! నువ్వు ధర్మత్యాగం, స్వార్థత్యాగం, రెండూ చెయ్యలేకుండా వున్నావోయ్!

ధర్మ : నేను నీలాంటి కసాయివాణ్ణికాను.

వైకుం: ధర్మన్నా! నీకు నామీద యింత కోపముందని నా కెన్నడూ తెలియదు. నువ్వు కష్టాల్లో వున్నావని తెలిస్తే ఏనాడో వచ్చేవాడ్ని. అయినా యిన్ని కష్టాల్లోవుండగా ఒక్క వుత్తరముక్కరాస్తే పోయేదిగా.

ధర్మ : ఎందుకురాయాలి? నీకూనాకూ ఏమి సంబంధముందని వ్రాయాలి.? నువ్వు నాకేమి సహాయంచెయ్యక్కర్లేదు ముందు యిక్కడనుంచి వెళ్ళు.

వైకుం: నువ్వు వెళ్ళమన్నా నేనెలా వెళ్తాను.? ఈ జబ్బు స్థితిలో నా స్నేహితుడ్ని వదలి వెళ్లను [జేబులో

నుండి డబ్బుతీసి) ఇదిగో తీసుకో. వెంటనే డాక్టర్ని పిలిపించు. ఆమెకు బాగుచేయించు.

ధర్మ : వొద్దు. నీడబ్బూవద్దు. నీవ్వూవద్దు. నీచేతుల్తో ఇచ్చేదంతా పాపిష్టిడబ్బే... వెళ్లు ..వెళ్లు.

వైకుం: (నవ్వి) వెళ్తున్నా (సిగరెట్టుతీసి నోట్లోపెట్టి... అగ్గిపెట్టెకోసం వెదకి సుజాతతో) అమ్మాయ్. కొంచెం అగ్గిపెట్టె పట్రామ్మా!

సుజా : (లోపలికి వెళుతుంది.)

వైకుం: (ధర్మన్న దగ్గరగావెళ్లి) ఏమిటాఅంకెలు? బెదరిస్తున్నావా? నేను నోరువిప్పితే నీగతేమవుతుంతో తెలుసా? యింతసేపూ ఆ అమ్మాయి వుందని వూరుకున్నా. నోరుమూసుకొని మర్యాదగా వెళ్లి డాక్టర్ని తీసికొవిరా.

ధర్మ : అసలు నువ్వెందుకురావాలిక్కడికి?

వైకుం: నిన్ను చూట్టానికి.

ధర్మ : నన్ను చూట్టానికా– యీా పిల్లను ఎత్తికెళ్లటానికా?

వైకుం: ఎత్తుకెళ్లి నీకేంతక్కువచేశారంటావ్? ఆ అమ్మాయికి ఏంలోపం జరిగింది.? రాణినిచేశాను. మహాభోగాలనుభవిస్తుంది. నిన్నూ నన్నూ చూసేలాగుందా యిప్పుడు?

ధర్మ : ఛీ... నోరువిప్పితే అన్నిఅబద్ధాలు. ఒకవైపు ఆ అమ్మాయి చనిపోయిందని లోకమంతా కోడై కూస్తుంటే యింకాబొంకుతావేం?

వైకుం: ఏడిశారు! లోకం... లోకులు కాకులు. ఎవడా చెప్పిందినీకు?

ధర్మ: అయితే నిజంగా ఆమె బ్రతికే ఉందంటావ్?

వైకుం: సందేహమా! తల్లితోడు. కావాలంటే నావెంటరా. నిన్ను చూసైనా పలుకరిస్తుందేమో (పక్కకుచూచి) ష్. మీ అమ్మాయి.

సుజా: (వచ్చి) నాన్నా! అమ్మకళ్లుతెలేసింది. పలకటంలేదు. కొయ్య బారిపోతోంది.

వైకుం: ధర్మన్నా! ఆమెనలాగే చంపుతావా? మందు కెళ్లొస్తావా? (డబ్బుతీసి) యిదిగోడబ్బు. వెళ్లిరా!

సుజా: నాన్నా అమ్మ బ్రతకటం నీకిష్టంలేదా?

ధర్మ: లేదమ్మా! లేదు. వెళ్లొస్తా! యిప్పుడే వెళ్లొస్తా! నువ్వు జాగ్రత్త! ఎక్కడకూ వెళ్లకు. (ముందుకువెళ్లి తిరిగి వెనక్కువచ్చి) వైకుంఠం నువ్వుకూడారా! డాక్టర్ను పిలుచుకొద్దాం.

వైకుం: ధర్మన్నా! నీవుద్దేశం గ్రహించాను. ఏం ఫరవాలేదు. వెళ్లిరా! రాత్రల్లా ప్రయాణంచేసి శరీరం ముక్కలై చస్తున్నా. నువ్వు లక్షరూపాయలిచ్చినా అడుగుతీసి అడుగువెయ్యలేను. నేనిక్కడే కూర్చుంటాను. నీ వెళ్ళిరా.

ధర్మ: సరే నేనేవెళ్తా! అమ్మాయ్ సీసాఏది? పట్రాతల్లీ!

సుజా: (లోపలికి వెళ్ళింది.)

ధర్మ: (సుజాతవెళ్ళింతరువాత) అమ్మాయితో రహస్యం— చెప్పతావా వైకుంఠం?

వైకుం: ఛీ. ఛీ. ఏం మనిషివయ్యా? నీ మనస్సును నువ్వే నమ్మలేకుండావున్నావ్! అందరూ నీలాంటి వాళ్ళేననుకున్నావా?

సుజా : (ప్రవేశించి) ఇదిగో నాన్నా సీసా!

ధర్మ : [సీసాతీసుకుని భయంగా వైకుంఠం, సుజాతలవైపు చూస్తూ వెళ్ళిపోయాడు]

వైకుం: పాపం! ఎంతమంచివాడు? ఎంతసహృదయుడు ఎలా మారిపోయాడు. పాడుప్రపంచం? నిన్నచూచి నవాడు ఈరోజున కనిపించటంలేదు.

సుజా : అవునండి. మానాన్న యీ త్రాగుడునేర్చి పూర్తిగా పాడైపోయాడు.

వైకుం: బాగుంది. ఆమాట నేనే అంటే ఎగిరి గొంతుపట్టుకుంటాడు. అమ్మాయ్...నీతో చిన్న రహస్యం చెప్పాలి.

సుజా : ఏమిటండీ అది?

వైకుం: [గబాగబా వాకిలిదగ్గరకెళ్ళి తొంగిచూచివచ్చి] ఈ విషయం మీనాన్నకు తెలిసిందంటే నీప్రాణం...నా ప్రాణం రెండూ దక్కవు. నాప్రాణానికేం ఫరవా లేదనుకో! ఎప్పుడైనా పోయేదే కాని...

సుజా : మానాన్న భయపడేవిషయమేనా మీరుచెప్పేది?

వైకుం: అవును. నువ్వు ఈ రహస్యం ఎక్కడా పొక్కనీయనని ప్రమాణంచేస్తే చెపుతాను. మళ్ళీ మీనాన్న వస్తాడు.

సుజా : ప్రమాణంచేస్తున్నా [వైకుంఠం చేతిలో చెయ్యివేసి] చెప్పనులెండి.

వైకుం: మీ అక్కయ్య బ్రతికివుందని తెలుసా? ఆ అమ్మాయిని గురించి ఎప్పుడైనా...ఏ ఒక్క క్షణమైనా తలుస్తారా? నిన్ను చూడాలని ఆమె ఎంత తహతహలాడుతుందో ఆసంగతైనా తెలుసా?

సుజా : తెలియదు.

వైకుం: అదే మీనాన్నకు- అక్కయ్యకు బద్ధవైరం ఆ పిల్ల నన్యాయం చేశాడు. ఆపిల్ల నిన్నూ, మీ అమ్మను చూడాలని అహోరాత్రాలుకుళ్ళి, కుళ్ళి ఏడుస్తోంది. నేనెంతని ఓదార్చేది.? ఇక్కడకొస్తే మీనాన్న బ్రతక నివ్వడని, యీవిషయం నీతో చెప్పమని నన్ను పంపింది. మీరొచ్చి ఆమెకంటబడకపోతే కొద్దిరోజుల్లోనే కాటికి ప్రయాణంకడుతుంది.

సుజా : అలాగా! మా అక్కయ్యకంత అన్యాయం చేశాడా? మానాన్న ఎన్నడూ నాతో చెప్పలేదేం? మాఅక్కయ్య బ్రతికి లేదనుకున్నాం. మాతో చచ్చిపోయిందని చెప్పాడు.

వైకుం: ఎన్నన్నా చెబుతాడు త్రాగుబోతు కబుర్లు. అమ్మాయ్! ఈవిషయం మాత్రం ఎక్కడా పొక్క నీయకు ప్రాణాలుపోతై.

సుజా : అయితే మాఅక్కయ్యను చూచే ఉపాయం చెప్పండి.

వైకుం: ఆవిషయం తరువాత చూదాంగాని, ముందు మీ అమ్మను చూడు.... ఇదిగో ఈసంగతి నీ కడుపులోనే పెట్టుకో.

సుజా : ఆ... ఆమా టేమరచాను. వెళ్ళొస్తా. [లోనికిపోవును]

వైకుం: [విలాసంగా...గర్వంగా నవ్వుతాడు ]
[లోపలనుంచి కెవ్వున కేక– ఏడ్పువినిపించింది. వైకుంఠం అదిరిపడ్డాడు.]

సుజా: (వచ్చి ఏడుస్తూ) ఏమండీ! అమ్మ... మా అమ్మ చని పోయింది. అమ్మా! (పెద్దగా ఏడుస్తుంది. ధర్మన్న మందులు తీసికొని డాక్టరుతో ప్రవేశం)

సుజా: [ధర్మన్నను చూచి] నాన్నా! అమ్మ శాశ్వతంగా మనల్ని విడిచిపోయింది నాన్నా! అమ్మా! అమ్మా! [ఏడుస్తూ లోకలికి వెళ్ళిపోయింది.

ధర్మ: [చేతిలోని సీసాలు క్రిందపడిపోయాయి స్థాణువులా నిలబడిపోయాడు.]

డాక్టరు: [వెళ్ళిపోతాడు.]

ధర్మ: [ఏడుస్తూ గుడ్డతో ముఖం కప్పుకున్నాడు.]

వైకుం: [ధర్మన్న భుజంమీద చేయివేసి] ఊరుకోధర్మన్నా... వూరుకో!... చింతించి లాభమేముంది ?.

[ తెర ]

# రెండవ రంగము

[అదొక పెద్ద బంగళా ఆ బంగళాలో విశాలమైన హాలు, ఆ హాలులో ఒక చిన్న Round Table. ఆ టేబులు పైన ఒక పూలకుండి. ఆష్ట్రేస్, ఆ టేబుల్ చుట్టూ మూడు సోఫాలుంటాయి. ఎదురుగా ద్వారం, ఆ ద్వారానికి సిల్కు కర్టెన్ ఎడమవైపు బయటకెళ్ళే ద్వారం. ఎదురుగా గోడకు రెండుకిటికీలున్నాయ్! వాటికిగూడ కర్టెన్ క్లాత్ వేసిఉంటాయి. ద్వారం ప్రక్కనే ఒక స్టాండు, దానిపై ఒక రేడియో, ప్రక్కన టెలిఫోను వుంటాయి. ఎదురుగా గోడకు అలారం గడియారం వుంది. గడియారం టంగ్, టంగ్ మని ఎనిమిది గంటలు కొట్టింది. మెల్లగా వినిపిస్తున్న రేడియో సంగీతం వెంకన్న వచ్చి ఆపివేశాడు. బయటకు వెళ్ళిపో యాడు. వైకుంఠం మేడమీదినుంచి విలాసంగా దిగివచ్చి టెలిఫోన్ రిసీవరు తీసి, రింగ్‌చేసి ఎవరితోనో మాట్లాడు తున్నాడు.]

వైకుం: హల్లో! నేను వైకుంఠాన్ని...ఎవరూ మాట్లాడేది?... శేట్‌గారా!... ఆ... నమస్కారం...మధ్యాహ్నమే వచ్చాను. అ... అ... అ... పనంతా పూర్త యింది. ఆ..., వెంటతీసుకొని వచ్చాను. తమరు ఎన్నిగంటలకొస్తారు ?... ఇప్పుడైతేనే మంచిది. పది నిమిషాలలో వస్తానంటారా ?... ఆ... రండి. తమ కోసం ఎదురుచూస్తూ ఉంటాను. [ఫోను క్రింద పెట్టి మెల్లగా బయటకు వెళ్ళుతున్నాడు. లోపలనుండి

విషాదమైన సంగీతం విన్పిస్తుంది. కొద్దిసేపు ఆగి విన్నాడు. చేతిలోని బెత్తంతో తలుపుమీదకొట్టాడు. బయటినుండి వెంకన్న వచ్చాడు. వైకుంఠం మెల్లగా వెంకన్న చెవిలో ఏదో చెప్పాడు. వెంకన్న మేడ మీదకు వెళ్ళాడు వైకుంఠం బయటికి వెళ్లాడు. సంగీతం ఆగిపోయింది. ఉండి వుండి భయంకరమైన ఉరుములు, మెరుపులు, వికృతమైన శబ్దాలు విని పించినై.]

సుజా: [లోపలినుండి వెఱ్ఱికేకవేసి భయంతో పరుగెత్తుకు వచ్చి] వెంకన్నా! వెంకన్నా!

వెంక: ఆఁ వస్తున్నానమ్మా! వస్తున్నా [లోపలికినుండి బయటకు రావాలి.]

సుజా: ఏం చేస్తున్నావ్? ఎక్కడికెళ్లావ్ ?

వెంక: అలా పైకి వెళ్లానమ్మా !

సుజా: పైకి దేనికి ? ఇక్కడ యీ దెయ్యాల కొంపలో యీ నరకంలో... యీ శ్మశానంలో నేను అల్లాడి చస్తూవుంటే నువ్వు పైకి వెళతావా ?... అసలు ఆయనేడి ?

వెంక : అలా టవున్‌లోనికి వెళ్ళాడమ్మా ?

సుజా : మరి యిక్కడి వాళ్ళేమవుతారు.

వెంక : ఇక్కడి వాళ్ళకేం తక్కువ ? అందమైన బంగళా, మెత్తని పరుపులు, కమ్మనితిండి, కావలసినంత డబ్బు!

సుజా : అయిందా ఉపన్యాసం ? హు...

వెంక : ఉపన్యాసాలు చెప్పే యోగ్యత నాకెక్కడిదమ్మా ?

సుజా : నీ యోగ్యతను గురించి కాదు నేనడిగేది. యీ పాపిష్టి కొంపలో ఎలా వుండటం ?

వెంక . మేమంతా వుండటల్లేదమ్మా !

సుజా : ఉంటున్నారు. ఇది మనుష్యులు నివసించే యిల్లులా లేదు. దయ్యాల కొంపలాగుంది.

వెంక : అవునమ్మా ! సత్యం చెప్పావ్ ? ఈ వేళ నిజంగా దెయ్యాల కొంపే అయింది. ఒకనాడు యీ ఇంట్లోనే ఒక మహారాజుండేవాడు. ఆ మహారాజు, బోలెడు మంద-మార్బలం, నౌకర్లూ—చాకర్లూ వుండేవారు. విందులతో-వినోదాలతో, పిల్లలతో-తల్లులతో ఇసుకవేస్తే రాలనంత జనం తిరుగుతూవుండేవారు. ఆ నాడు యిది ఒక దేవేంద్ర భవనంలా ఉండేది.

సుజా : మరి వాళ్ళంతా యిప్పుడే మయినట్లు ?

వెంక : ఏం చెప్పేది తల్లీ ! అదంతా ఓ పెద్ద చరిత్ర...ఆ... ఇప్పుడిదంతా ఎందుకులేమ్మా !

సుజా : వెంకన్నా నువ్విక్కడ చాలా కాలం నుంచి వుంటున్నావ్ కదూ ?

వెంక : అవునమ్మా !

సుజా : మా అక్కయ్యను నువ్వెప్పుడైనా చూచావ్ ?

వెంక : చూశానమ్మా !

సుజా : ఎలా వుంటుంది ?

వెంక : అచ్చం మీలాగే ఉంటుంది మీకుమల్లేనే పట్టి పిచ్చిబాగుల్ది.

సుజా : (అమాయకంగా) అయితే నేను పిచ్చిదాన్నంటావా?

వెంక : కాదా !... ఎప్పుడో యిక్కడినుండి వెళ్ళిపోయిన అక్కయ్యను గురించి నాకేం తెలుస్తుంది ?

సుజా : అయితే చూడలేదన్నమాట ?

వెంక : చూశానమ్మా !

సుజా : మరి చూడలేదంటావ్ !

వెంక : లేదంటే యిప్పుడు లేదంటున్నా.

సుజా : సరే ! నీదంతా అడవి మేళం.

వెంక : అడవిలో ఉండే వాళ్ళకు అడవిమేళంగాక మరొకటి ఎలా ఉంటుంది ?

సుజా : అదిగాదు వెంకన్నా ? రేపు నేను మా అక్కను చూడాలి. ఎల్లుండికల్లా మా యింటికి వెళ్ళాలి. మా నాన్న నా కోసం ఎంత తపిస్తున్నాడో ? పైగా ఆయనకు చెప్పలేదుకూడ ...!

వెంక : ఇక్కడికొచ్చేవాళ్ళు ఎవరూ చెప్పిరారమ్మా ! అదో సాంప్రదాయం.

సుజా : వైకుంఠంగారు దగ్గర్లోనేనని చెప్పారు. రైలుస్టేషన్‌కు వచ్చాం. దాహమయితే వారేమిటో ద్రాక్షని తెచ్చి యిచ్చారు. అది త్రాగాను. చచ్చేటంత నిద్ర వచ్చింది. మరల కళ్ళుతెరచేసరికి యిక్కడ వున్నాను. అసలు వైకుంఠం మా అక్కయ్యను చూపిస్తాడంటావా ?

వెంక : చూపిస్తాడమ్మా. ఆయన కం[illegible] తిరుగే వుండదు.

సుజా : అంత మంచివారన్నమాట.

వెంక : నిదానంగా నీకే తెలుస్తుందిలేమ్మా!
సుజా : వైకుంఠం చెడ్డవాడేమోనని భయపడ్డాను.
వెంక: ఆయన బయటకు మీరనుకున్నంత చెడ్డవారుగాదమ్మా!
సుజా : అయితే ఆయనకు ఎవరూ లేరన్నమాట?
వెంక : ఇక్కడ ఎవరూ లేరమ్మా! ఎప్పుడైనా నీలాంటివారు రావడం-పోవడం చూస్తూ వుంటాను.
సుజా : నాలాంటి వాళ్ళంటే?
వెంక : మీరూ, మీ అక్కయ్యలాంటివాళ్లు.
(బయట వికృతమైన అరుపులు వినిపిస్తాయి.)
సుజా : (భయంతో) అమ్మో! ఏమిటాకూతలు? నక్కలా?
వెంక : అవునమ్మా! నక్కలే...నక్కలు కుక్కలకన్నా మహా అన్యాయం. అవి అరిచేవికాని కరిచేవికావులే !
సుజా : మరి మనుష్యుల్ని తింటాయిటగా?
వెంక : మనుష్యుల్ని మనుష్యులే తింటున్న యీరోజుల్లో... ఆ...వస్తానమ్మా! అయ్యగారు వస్తున్నట్లున్నారు.
సుజా : నువ్విక్కడేవుండు వెంకన్నా! నాకేంటో భయంగా వుంది. ఈరాత్రి తెల్లవారితే......
వెంక : ఈరాత్రి అంత తేలిగ్గా తెల్లవారుతుందా అమ్మా? రాత్రి 12 గంటలు గడవాలి. ఆ అర్ధరాత్రిలో ఏంజరుగుతుందో తెలుసా అమ్మా!
సుజా : నాకేం తెలుసు?
వెంక : అయితే చెబుతావిను. క్రూరమృగాలు, కాలసర్పాలు బహిరంగంగానే ఎదుటి ప్రాణాలను చంపుకు తింటయ్ కాని మరికొన్ని ప్రాణులున్నాయ్. ఆ ప్రాణులు రాత్రి

ప్రశాంతంగా నిద్రించే అమాయక ప్రాణులను చంపి రక్తం తాగుతైతే. వాటి ఆహారవిహారాలు, వాటి ఎత్తుగడలూ ఎవరూచూడరాదు. ఆ ప్రాణుల పేరేమిటో తెలుసా అమ్మా? మనుష్యులు.

సుజా : అమ్మో! మనుష్యులే! అలాంటివాళ్లే ఇక్కడ ఉంటారా?

వెంక . ఇక్కడెందుకుంటారమ్మా? ఈ యిల్లు ఎవరిదో తెలుసా? వైకుంఠంగారిది. వారివల్ల యీ యింటికి ఆ పేరు సార్థకమైయింది. మనుష్యులు పాపంచేస్తే నరకానికి వెళతారు. మీలాంటి పుణ్యవతులకే యీ యింటికొచ్చే అర్హతవుంది.

సుజా : అబ్బ! నీవుచెప్పేది బొత్తిగా అర్థంకావటంలేదు. వెంకన్నా!

వెంక : అవునమ్మా! అర్థంకాదు. నీకేకాదు. ఒకనాడు నాకే అర్థంకాలేదు... వస్తానమ్మా! వస్తా! (బయటికివెళ్లి పోతాడు.)

సుజా : (లోనికి వెళ్లి పోతోంది.)

వైకుం : (వచ్చి నిశ్శబ్దంగా నిలబడి నాల్గువైపుల చూశాడు.)

సేట్ : (వచ్చి) క్యాజీ వైకుంఠంసాబ్? క్యాకహతాహై బుల్ బుల్...?

వైకుం: ఇస్...లోనికి మాటలువినబడతై జాగ్రత్త. పెంపుడు చిలక పెట్టింది తింటుంది. చెప్పింది చేస్తుంది. మన వాళ్లకు కబురుచేశాను. వచ్చేవేళయింది. నే బైటకు వెళ్లివస్తా. మీరు కూర్చోండి. (వెళ్లాడు.)

సేట్ : (కుర్చీలో కూర్చుంటాడు.)

సుజా : (లోపలినుండి బయటికివస్తుంది.)

సేట్ : (సుజాతను పలకరించాలనే ఉద్దేశంతో) ఇదుగో చూడుహమ్మా! వైకుంఠంగార్ హిక్కడవుండార్...?

సుజా : నాకు తెలియదు.

సేట్ : అరే రాం... రాం... హెంతకష్టం... హెంతకష్టం, ఇదిగో కొంచెం దాహంకావాలి!

సుజా : (లోనికి వెళ్ళిపోతుంది.)

సేట్ : (కుర్చీలో కూర్చున్నాడు దామోదరం వస్తాడు.)

దామో: (వచ్చి సేట్‌నుచూచి పద్యంలో)

"బావా ఎప్పుడు వచ్చితీవు. సుఖులేగదా నీవున్, నీ దుష్టచతుష్టయంబు."

సేట్ : అరేగాడ్ది. చుప్ రే...చుప్...

దామో: ఏమిటికథా?

సేట్ : హరే నీకు హెందుక్కువచ్చావ్ హిక్కడీక్కి ?

దామో: నీ కోసం.

సేట్ : నా కోసం హెందుక్కు?

దామో: ఎందుకంటే పనుండి.

సేట్ : పనీలేదూ గినీలేదూ...జావ్ జావ్.

దామో: నే వెళతానికి రాలేదు.

సేట్ : అరె బద్మాష్! నీకు హేమ్టిమో కావాల?

దామో: డబ్బుకావాలి.

సేట్ : డబ్బా! డబ్బా! హెక్డాహుందోయ్ ?

దామో : వుందిలే చూడండి.

సేట్ : హెక్కడ చూసేది ?

దామో : జేబులో...

సేట్ : అరే జేబూ లేదూ గీబూ లేదు. నీకి హొక్కటి పైసా కూడా మాకి హివ్వం.

దామో: ఇవ్వవా ?...

సేట్ : నహీం !

దామో: సరే. నీవెలా యివ్వవో నేను చూస్తాను.

సేట్ : అరే సైతాన్ ! హేట్లా చేస్తాన్ ?

దామో: ఏదో చేస్తాను. ఏది నువ్విలా రా ! నన్ను ఫోను దగ్గరకు వెళ్ళనియ్. కాస్త పోలీసుస్టేషనుకు ఫోను చెయ్యనియ్.

సేట్ : పోలీస్‌స్టేషన్. హెందుక్కా పోలీస్‌స్టేషన్?

దామో: ఒక రహస్యం చెప్పాలి.

సేట్ : అరే బేవ్‌కూఫ్... మాకీ సైతాన్‌లాగ పట్టుకున్నావ్, నీకీ హెంత కావాల డబ్బు... బోలో !

దామో: వెయ్యిరూపాయలు.

సేట్ : ఏక్ హజార్ నాకీ హిచ్చేది లేదు.

దామో: ఇవ్వకపోతే మానేయండి (వెళ్ళి రిసీవర్ తీసికొని రింగ్ చేయబోయాడు.)

సేట్: (జేబులోనుండితీస్తూ) హిద్గో చావ్! సైతాన్‌కా బేటా!

దామో: (తీసికొని జేబులో పెట్టుకుంటాడు)

సుజా : (గ్లాసుతో మంచినీళ్ళు తెస్తుంది.)

దామో: (చూచి) ఓహో... ఇందుకా మీరు యిక్కడికి వస్తు. సరి క్రొత్త చిలుక !

సేఠ్ : జావ్... జావ్ !

దామో: వెళతా కాస్త ఆగు.

సుజా : ఇదిగోనండి మంచినీళ్ళు.

సేఠ్ : (తీసికొని (తాగి) అచ్ఛా! అచ్ఛా! భగవాన్ భలా చెయ్యవలా !

దామో: ఆ అమ్మాయికంటే ముందు భగవంతుడు నీకు మేలు చెయ్యాలి.

సుజా : ఎవరీయన...?

సేఠ్ : నాకీ సాలె.

దామో: అవును వాడికి బావమర్దినే మై నేమ్ ఈజ్ దామోదరం! దగాకోరులకు మన పేరు చెపితే గుండెల్లో దడ. ఆపన్నులకు మనం ఒక పెట్టనినీడ, మీరు వెతికితే దొరకదు జాడ.

సేఠ్ : చుప్ఫే సైతాన్ కా బేటా !

దామో: అలాగే!... వస్తా!... టా!...టా! (వెళ్తాడు.)

సుజా : (నవ్వి) బలే వాడేనే !

సేఠ్ : బలే గిలే జాంతానై... బడాబద్మాష్.

సుజా : మీరు వ్యాపారస్తులా !

సేఠ్ : హెందుక్కాదు. మాకి బడా... ఛోటా వ్యాపారమే చేస్తాం. సోనాకాదు... కాన్... బడా బడా మకాం.., రైస్‌దుకాన్... గుడ్డల్‌షాపు ... పలార్ కొట్టు మిందులకొట్టు, కాఫీకొట్టు...కిళ్ళీకొట్టు... వందల్... వందల్ బేపార్ చేసాం.

సుజా : అయితే మీా దగ్గర అన్ని వస్తువులు దొరుకుతా యన్న మాట ?

సేట్ : సోనా కావాలి మందీ పేర్ చెప్పొ. రైస్ కావాలి మందీ పేర్ చెప్పొ... కపడా కావాలి మందీపేర్ చెప్పొ... మకాన్ కావాలీమందీ పేర్ చెప్పొ. సబ్ కుచ్ హమారా దుకాన్ మే హై... మీాకు హేమ్టిా కావాలా చెప్పొ. హింటామ్ ,..!

సుజా : నాకేమీావద్దు,

సేట్ : అరేవద్దూ గిద్దూ జాంతానై...కానీ హియ్యావలె... నీకీ నాజూక్ చెయ్యావలె.

సుజా : మాటలు జాగ్రత్తగారానీయండీ. మీారెవరు నాకీయటానికి?

సేట్ : ఎవళ్ళ్యాహం తే బేపారస్తులం. హెందుక్కా హింత కోపం? ప్యారీ...బుల్ బుల్! మీాఠా మీాఠా మాటల్ చెప్పొ హింటామ్.

సుజా : వెంకన్నా, వెంకన్నా!

సేట్ : వాడ్కీ హెందుకు? నాదీమాటహీను.

సుజా : ఛీ...వెళ్ళవతలకి.

సేట్ : అదీమాట చెప్తే మాకీ చస్తాం. నీకీ చల్లనిచూపు చూడవాల. మేము బతక్కావాల... (దగ్గరగా వెళ్ళి) క్యా ప్యారీ !

సుజా : నోన్సెన్స్, (లాగి చెంపన కొట్టవలెను.)

సేట్ : (బిత్తరపోయాడు.)

[బయట తలుపుదగ్గరనుండి పెద్ద నవ్వు వినిపించింది. సేట్, సుజాత అటు చూస్తారు.]

దామో: (వచ్చి) శెభాష్... మా బావగారికి మంచిబహుమానం... అమ్మాయ్ నీకు నా దన్యవాదాలు. అభిమానవంతుల ఆదర్శం చూపించావ్ !

సేట్ : చుప్ రే సైతాన్ (వెళ్ళబోతూ) చూపిస్తాం. మాకీ తడాఖా...

దామో: అయ్యో ! కాస్త ఆగండి.

సేట్ : (కోపంగా) హేందుక్...?

దామో: ఇప్పుడు దవడమాత్రమే శుద్ధి అయింది. ఈ సారి ఆ అమ్మాయిజోలికి వెళితే వీపు శుద్ధవుతుంది తరువాత విచారిస్తే లాభంలేదు. (కూనిరాగం తీస్తూ "తగదంటిని వింటివిరా తరుణీతో పరిహాసము."

సేట్ : అరే బద్మాష్! మాడీపైసా తిని మాకీ హేగతాళి చేస్తావ్ ! దేఖ్ తాహు ! (రివ్వున వెళ్ళిపోతాడు.)

దామో: ఈ నాటికి ప్రారంభమయింది దేవదానవుల యుద్ధం. ఓ అభిమానవతీ యివే నీకు నా జోహారులు. (వెళ్ళబోవలె)

సుజా : మీ రెవరు ? (సిగ్గుతో)

దామో: నేనా (నవ్వి) నిరాధార, నిర్భాగ్య, దామోదరుణ్ణి. మనకు సర్వం జగన్నాధం "నా" అనేవాళ్ళు లేరు. "నో" అనేవాళ్ళులేరు. మనకు మనమే "జైఅలక్ నిరంజన్."

సుజా : ఆయన మీ బావగారంటిరే! చూడండి...అంత పెద్దవాడుపరాయి ఆడవాళ్ళను అలా అవమానించవచ్చా?

దామో: అందుకే ప్రతిఫలం పొందాడు.
సుజా : అలా కొట్టాసని మీకు కోపం లేదుకదా?
దామో: నో! నో! ఎంతమాత్రం కోపంలేదు. కాని...కొట్టి
బోయేముందు నాకుచెప్తే కొత్తచెప్పు కొనిచ్చేవాణ్ణి.
అసలు మీరెవరు? ఈ యమకంఠగృహానికెందు
కొచ్చారు?
సుజా : యమకంఠ ఏమిటి?
దామో: ఈపుణ్యపురుషుల సార్థక నామధేయం అదే...వస్తా.
"అంగనడాయ లేక కుతిలాంతక దుష్టచతుష్టయంబు."
(చిన్న రాగంతీస్తూ నిర్లక్ష్యంగా వెళ్ళబోయాడు.)
వైకుం: (వస్తాడు.)
దామో: [వైకుంఠాన్నిచూచి పద్యం ఆపి] గుడ్‌నైట్ మిస్టర్
కాతాజీ! (నెత్తిన టోపీతీసి నమస్కరించును.)
వైకుం : నోర్మూయ్ !
దామో: తమ అనుజ్ఞ (నవ్వి)
వైకుం : ఎందుకు చచ్చావిక్కడికి ?
దామో: చావబోయేముందు ధర్మరాజుల్లాంటి వైకుంఠాన్ని
చూచి వెళ్దామని.
వైకుం : నిన్నిక్కడకు రావద్దని ఎన్నిసార్లు చెప్పాను ?
దామో: రాకపోతే నాకు జరగదు. వస్తే మీకు జరగదు...
వస్తా. టా...టా...(వెళ్ళబోతాడు)
వైకుం : (రివ్వునవెళ్ళి పట్టుకోబోయాడు దామోదరాన్ని)
సుజా : (వెళ్ళి వైకుంఠం చెయ్యి పట్టుకుంది.)
వైకుం : (వెనుతిరిగి చూస్తాడు.) విడిచిపెట్టు-డొక్క-చీలుస్తాను.

సుజా : ఆయనేం చేశాడు ?

వైకుం : పిచ్చివెధవ, వాడితో పలక్కు.

సుజా : పిచ్చో, మంచో, నిజం మాట్లాడుతాడు. అదిగో ! మీ కోసం యిందాక వచ్చాడు. సేట్ గారట, పతి మాసం మర్యాద తెలియని మనిషి.

వైకుం: ఏమన్నా అన్నాడా?

సుజా : అన్నాడు నాచేత చెంపదెబ్బ తిన్నాడు.

వైకుం: [అదిరిపడి] కొట్టావా! [నవ్వి] మంచిపనిచేశావ్ వెధవని.

సుజా . యింకా చేసేదాన్నే. కాని మిమ్మల్ని చూచి వూరుకున్నాను.

వైకుం: ఆ...చూడు సుజాతా! చాల ప్రొద్దుపోయింది. వెళ్ళి పడుకో నాకు చాలాపనివుంది.

సుజా : మా అక్కయ్య దగ్గరకెళ్లొచ్చారా?

వైకుం: వెళ్లొచ్చాను. రేపు ఉదయమే వస్తానంది.

సుజా : [సంతోషంగా] వస్తానందా? నేను వచ్చానని చెప్పారా? అమ్మ చనిపోయిందనిచెప్పారా?

వైకుం: అన్నీ చెప్పాను. మీ అమ్మ చనిపోయినందులకు చాల సేపు ఏడ్చింది. ఆఖరిసారైనా అమ్మను చూడలేక పోయానని పొర్లి పొర్లి ఏడ్చింది. ఇప్పుడేడిస్తే లాభమేమి టని కాస్త ఓదార్చివచ్చాను.

సుజా : [విచారంగా] అమ్మగూడ అదేచెప్పి ఏడ్చేది. డబ్బు కోసం అక్కయ్య ప్రాణాలుతీసి, దాన్ని కళ్లతోగూడ చూచేయోగ్యత లేకుండా చేసుకున్నామని యేడ్చేది.

అక్కయ్యను తీసుకువెళ్ళిన పాపిష్టి వాడిని అనుకోవాలి. రాక్షసుడు. తల్లినీ బిడ్డనీ వేరుచేశాడు. ఇంత దగ్గరలో వుండికూడ అక్కయ్యను మా ముఖం చూడకుండా చేశాడు. పాపిష్టిడబ్బు.

వైకుం : నిన్నే! ఇప్పుడు తిట్టినా, ఏడ్చినా ఏం ప్రయోజనం? అసలు డబ్బుకోసం కన్నకూతుర్ని అమ్ముకున్న మీ నాన్నని అనాలిగాని.

సుజా : ఎంత పాపం చేసుకుని పుట్టానో! (విచారంగా లోనికి వెళ్ళిపోతుంది.)

వైకుం : [కుర్చీలో కూర్చున్నాడు.]

వెంక : [ప్రవేసించాడు ]

వైకుం : వస్తున్న జాడ ఏమైనా ఉందా?

వెంక : లేదండి.

వైకుం : [కుర్చీలోంచి లేచి అటూయిటూ తిరిగి] ఊఁ. [illegible] నేను పైన మేడమీద వుంటాను. వాళ్ళు రాగానే పైకి తీసుకొనిరా! [వెళ్ళిపోతాడు]

వెంక : చిత్తం! [అక్కడే నిలబడిఉండాలి.]

సుజా . (ఏదో మరిచిపోయినట్లుగా తిరిగిప్రవేశించి) వెంకన్నా!

వెంక : ఏమ్మా?

సుజా : ఆ గదిలో సాలెగూళ్ళున్నయ్యేమిటి?

వెంక : సంస్కారం లేక ...!

సుజా : మీరన్నా దులపకూడదూ?

వెంక : ఆడవాళ్ళు లేని యింటికి సాలెగూళ్ళే అలంకారమమ్మా

సుజా : నీ మనసులో ఏమిటో బాధపడుతున్నట్లున్నావే?

వెంక : బిడ్డలు గన్నవాడికి బాధకాక, సంతోషముం టుందామ్మా ?

సుజా : నీ భార్యాబిడ్డలు ఎక్కడున్నారు ?

వెంక : భార్య...! బిడ్డలు...! ఎక్కడున్నారు ? వాళ్లెక్క డున్నారని చెప్పేది తల్లీ! [కన్నీరు తుడుచుకొనుచు]

సుజా : [జాలిగా] అయితే వాళ్ళు చచ్చిపోయారన్నమాట !

వెంక : అవును తల్లీ ! అవును. ఈ నిర్భాగ్యుడు అలాంటి అదృష్టానికి నోచుకోలేదు. పదమ్మా! ఆ సాలె గూళ్ళు దులుపుదాం.

సుజా : ఇంతరాత్రివేళ ఏం దులుపుతావులే ! రేపుదయం దులపొచ్చు... ఆ... విన్నావా వెంకన్నా !

వెంక : ఏమిటమ్మా అది?

సుజా : రేప్రొద్దున మా అక్కయ్య వస్తుందట యిక్కడికి

వెంక : ఎవరు చెప్పారు?

సుజా : వైకుంఠంగారు. వారు యిప్పుడే మా అక్కయ్య దగ్గర కెళ్లివచ్చారట. అమ్మనూ, నన్నూ తలుచుకొని ఎంత గానో ఏడ్చిందట.

వెంక : అవునమ్మా! ఆరోజు నాకే గుండెపగిలింది. నా కడుపు తరుక్కుపోయింది. ఆ పిల్ల బాధ, ఏడ్పు చూళ్లేక పోయాను.

సుజా : ఏరోజు?

వెంక : [తెప్పరిల్లి] అదేనమ్మా! అమ్మాయిగారు యిక్కడకు క్రొత్తగా వచ్చినరోజు.

సుజా : నాన్న పాడుడబ్బుకోసం దాన్ని చాల అన్యాయం చేశాడు వెంకన్నా! [ఏడ్చింది]

వెంక: [ఓదార్చుతూ] ఈ పాపిష్టి డబ్బుకోసమే మనిషి ఆత్మీయతను త్రెంచుకొని ఆగర్భశత్రువవుతున్నాడు. ఈ డబ్బుకోసమే హత్యలు దోపిడీలు, మోసం, దగా, దౌష్ట్యం, అన్యాయం, రాక్షసత్వం. ఈ డబ్బు మనిషి ప్రాణం తీస్తుంది. ఈ డబ్బు మనిషిని గొప్పవాణ్ణి చేస్తుంది. ఈ డబ్బువల్ల ఎన్నో సంసారాలు నాశనం అవుతున్నాయి. ఎందరు దుఃఖకూపాల్లో మునిగి పోతున్నారో ? ఎందరు తల్లీ బిడ్డకూ, తండ్రీ కొడుక్కూ సంబంధాలు లేకుండా పోతున్నయో ? ఎందరు పచ్చని సంసారాల్ని కళ్ళతో చూచే ప్రాప్తి లేక బలి అవుతున్నారో ఈ డబ్బువల్ల. ఏం చేస్తాం తల్లీ ! డబ్బుకోసం మనిషి విషసర్పమవుతున్నాడు. ఈ డబ్బువల్లనే నా కుటుంబం నిలువునా నాశనమైంది తల్లీ ! (ఏడుస్తూ మాట్లాడలేక లోనికి వెళ్ళిపోతాడు.)

సుజా : వెంకన్నా ? వెంకన్నా ! ( ఈమెకూడ లోనికి వెళ్ళుతుంది.)

వెంక : (లైట్లు ఆఫ్ చేయడానికి వచ్చాడు,)

శివకాసి : (డాక్టర్ శివకాసి నీటుగా డ్రెస్ వేసుకొని, మెడకు మఫ్లర్ చుట్టి, చేతిలో టార్చిలైటుపట్టుకొని ప్రవేశించి వెంకన్నను చూచి) వెంకన్నా !

వెంక : తమరాబాబూ ! రండి ! అయ్యగారు తమకోసమే ఎదురు చూస్తున్నారు.

శివ : నాకు తెలుసు. నా కోసం ఎదురు చూస్తాడనీ... కలవ రిస్తాడని.

వెంక : (నవ్వి) నాకు తెలియదా బాబూ! వైకుంఠంగారికి మీరు కుడిభుజంలాంటివారు. వారిని నిలబెట్టిందే మీరని చాలాసార్లు అన్నారు బాబూ !

శివ : అన్నాడూ ! (నవ్వి) నాకు తెలుసు అనాలి... దీపం పెట్టి మన పేరు తలుచుకోవాలి. కాదంటావా వెంకన్నా ?

వెంక : అయ్యగారు కాదన్నా నేనెలా అంటాను బాబూ ! నాకు తెలీదా బాబూ !

శివ : వెరీగుడ్... వెరీగుడ్ స్వామిభక్తివల్ల నిజం దాస్తావను కున్నాను ఇదిగో డబ్బు దగ్గర పెట్టుకో (యిస్తాడు)

వెంక : (అందుకొని) ధర్మమూర్తులు. దానం చెయ్యటంలో మీ తరువాతే...! పదండి పైకి.

శివ : (విలాసంగా పైకి వెళ్ళిపోతాడు.)

వెంక : (డాక్టరిచ్చిన డబ్బు లెక్కపెట్టుకొని వెనక్కు తిరిగే సరికి సదానందం రావాలి) అయ్యగారు పైన ఉన్నారు త్వరగా పదండి.

సదా : వెంకన్నా ! మనవాళ్ళెవరైనా వచ్చారా ?

వెంక : వచ్చారు బాబూ ! డాక్టర్‌గారు పైకెళ్ళారిప్పుడే...

సదా : వెళ్ళాడూ ? వెళ్తాడు. నేననుకుంటూనే వున్నాను.

వెంక : ఏమిటి బాబూ అది ?

సదా : ఒక్కటడుగుతా నిజంచెప్పు! విశ్వాసం గలప్రాణిఏది?

వెంక : కుక్కండి.

సదా: మరి మనుష్యుల్ని గురించి నీ అభిప్రాయమేమిటి ?
వెంక : నౌకరు పని చేసేవాడి అభిప్రాయాలు దేనికి బాబూ ?
సదా : చెప్పు ఫర్వాలేదు.
వెంక : కృతజ్ఞతంటే మీకు తెలిసిందానికన్నా నాకు ఎక్కువ తెలుసుద్దా బాబూ ?
సదా : సత్యం గ్రహించావ్. కాని నా నిజాయితీని వైకుంఠం గుర్తించడు.
వెంక : ఏరు దాటినాక పడవ అవసరం దేనికి బాబూ ?
సదా : ఓరి నీ దెబ్బకూల ! ఎంతసత్యం చెప్పావోయ్ ? నిప్పుకన్నా చురుకైన నిజం చెప్పావ్ ! ఇదిగో ! ఈ డబ్బు ఉంచుకో... (అని పైకి వెళ్ళాడు)
వెంక : (ఇచ్చిన డబ్బును లెక్కపెట్టి బొక్కలో నొక్కుతాడు.)
దుర్గారావు : (ఇన్సూర్ ఏజంటు దుర్గారావు ప్రవేశం)
వెంక : (చూచి) రండిబాబూ! ఆలశ్యం అవుతుందని అయ్య గారు గోల చేస్తున్నారు. పైకి పదండి.
దుర్గా : రావలసిన వాళ్ళంతా వచ్చినట్లేనా ?
వెంక : సేట్‌గారుతప్ప తక్కినవాళ్ళంతా వచ్చినట్లేబాబూ.
దుర్గా : నేను రాలేదని వైకుంఠంగారు అనుకున్నారా ?
వెంక : అసలు సూత్రదారులే తమరైనప్పుడు, తమర్ని గురించి ఎవ్వరుమాత్రం అనుకోరు బాబూ !
దుర్గా : నీపాటి జ్ఞానం మా స్నేహితులకు లేదు వెంకన్నా!
వెంక : అదే బాబూ నా బాధకూడాను. మీరింత కష్ట పడి వారికోసం పాటుబడినా కాస్తయినా అభిమానం వుంచరు. మరీ ఆ సేట్‌గారు.

దుర్గా : వాడా ! లుచ్చా ! ఆ వెధవకి డబ్బుంటే వుందిగాని హృదయమెక్కడ వుందోయ్ ?

వెంక : నిజం చెప్పారుబాబూ ! హృదయం కసాయివాడికెందుకు ? అభిమానం దుర్మార్గుడికెందుకు ? నీచులకు నీచత్వంగాక మరేముంటుంది ? గంజాయి మొక్కల్లో మల్లె మొక్కని, గాజు పెంకుల్లో వజ్రాల్ని వేసుకోగలమా బాబూ ?

దుర్గా : బ్రహ్మాండంగా చెప్పావు వెంకన్నా ! ఇదిగో ! ఈ డబ్బు వుంచుకో ఎందుకైనా పనికివస్తుంది. (ఇచ్చాడు)

వెంక : (అందుకొని) మీ ఋణం ఎలా తీర్చుకోను బాబూ?

దుర్గా : ఫరవాలేదు. నీ కష్టం మాత్రం ఎవరు తీరుస్తారు?

వెంక : నా కష్టం భగవంతుడే తీర్చాలయ్యా ! అది మనుష్యులకు సాధ్యపడేది కాదు. అందులో మీలాంటి రాక్షసులవల్ల (కొంచెం ఆగి నవ్వి) తీరదంటాడయ్యా ఆ సేట్ గారు.

దుర్గా : అంటాడోయ్ ! అంటాడు. వాడికి రోజులు దగ్గర పడ్డాయి. వస్తా ! (పైకి వెళ్ళిపోవలెను)

సేట్ : (ప్రవేశించి) హెంకన్నా !

వెంక : అయ్యా !

సేట్ : వైకుంఠంగారు హెక్డా ?

వెంక : పైనున్నారు. తమర్నిరమ్మన్నారయ్యా ! పదండి.

సేట్ : హెంకన్నా ! నీకి హచ్చా ఛప్రాసీవోయ్.

వెంక : తమదయవల్ల అలా అనిపించుకుంటున్నానయ్యా !

సేట్ : (డబ్బుతీసి) హిఙ్గో ! యీపైసా నీకీ దగ్గర హుంచు
(వెంకన్నకు యిస్తాడు.)

వెంక : (అందుకొని) ధర్మప్రభువులు.

సేట్ : (నవ్వి) ఆఁ హిఙ్గో హెంకన్నా!...ఆ బుల్ బుల్
హెక్డావుంది?

వెంక : ఇప్పుడు బయటికిరాదు. నిద్రపోతోంది!

సేట్ : నిద్రాపోతుంది. హారే హెంకన్నా! హది పిల్ల మన్కి
కావాలోయ్

వెంక : చిత్తమండయ్యా.

సేట్ : దాన్కి మనం హుంచుకోవాలోయ్.

వెంక : చిత్తమండయ్యా!

సేట్ : దాన్కి మన్దీమీద మోజుకల్గవల.

వెంక : సరేనండయ్య.

సేట్ : దాన్కి రాణిని చేస్తాం. నీకి పదిహజార్ రూప్యాహిస్తాం.

వెంక : నాకొండయ్యా!

సేట్ : నీకే! హెందుక్ అంతభయం? దాన్కిముందు మన్ది
మాట హమేషా చెప్తూవుండాల్.

వెంక : చెప్తానయ్యా!

సేట్ : దాన్కి హందం, చందం దిల్‌ఖుష్ చేస్తూహుండాద్.

వెంక : తెలిసిందయ్యా!

సేట్ : హదీ పిల్లకు వైకుంఠం లవ్ చేస్తావుంది. నీకీ తెల్సు
కుంటే నాకు జర్రా చెప్పవల.

వెంక : అట్లాగేనయ్యా! పైకివెళ్ళండి.

సేట్ : మాకీ వస్తాం (పైకి వెళ్ళిపోవలెను.)

దామో: (ప్రవేశించి- మెల్లగ) తాతా!
వెంక : బాబూ నువ్వా? ఇంతరాత్రివేళ వచ్చారేం?
దామో: పనివుందిగాని...యీ గ్యాంగంతా వచ్చినట్లేనా?
వెంక : అంతా వచ్చారు బాబూ!
దామో: వాళ్ళు ఏం కుట్రపన్నుతున్నారో తెలుసా?
వెంక : తెలుసు.
దామో: తెలుసా? ఏమిటా కారణం చెప్పు వెంకన్న తాతా.
వెంక : చెప్పను.
దామో: ఏం? ఎందుకని?
వెంక : అది నా ఉద్యోగధర్మం కాదుగాబట్టి.
దామో: ఇది విద్రోహం చేసినట్లుకాదా ఆ పిల్లకు?
వెంక : నేను నౌకర్ని గాని న్యాయవాదిని కాదు బాబూ!
దామో: వెంకన్న తాతా! నీ కుమార్తెకే అలాంటి విపత్తు రాబోతూవుంటే యీ విధంగానే చెపుతావా?
వెంక : బాబూ!
దామో : దొండపండుని కాకులు ఎత్తుకుపోతూవుంటే... కురంగశాభకాల్ని క్రూరమృగలు।చంపబోతూవుంటే నువ్వు చూస్తూ వూరుకుంటావా తాతా? పెద్ద వాడివి హృదయమున్నవాడివి, పిల్లలుగలవాడివి, కేవలం నీ బ్రతుకు అమాయకుల బలిదానం జరగ బోతూవుంటే చూస్తూ ఊరుకుంటావా?
వెంక : (కన్నీరు కారుస్తూ) నిజం బాబూ! నిజం. నేనూ యీ కసాయివాళ్ళల్లో కసాయివాణ్ణే. అసలు నేనెం దుకు బ్రతుకుతున్నానో ఎవరికోసమో, ఏం సాధించ

టానికీ తుచ్ఛమైన నౌకరీ చేస్తున్నానో చెప్పలేను.
నాలో మానవత్వం చచ్చిపోయింది. నేను క్షుద్రుణ్ణి.

దామో : అదికాదు వెంకన్న తాతా! మనకు స్వార్థంలేనంత మాత్రాన మనకు యీ పిల్ల ఏమీకానంతమాత్రాన తుచ్ఛులు చేయబోతున్న దారుణాన్ని యెలా చూచి సహిస్తాం చెప్పు ?

వెంక : సత్యం చెప్పావ్ నాయనా! వయస్సులో చిన్నవాడ వైనా, బుద్ధిలో నాకన్నా గొప్పవాడివి బాబూ! నువ్వు యిప్పుడు యిక్కడ కనిపించరాదు. వెళ్ళు ఆ పిల్లకు ఎలాంటి అన్యాయం జరగదు.

దామో: తాతా!

వెంక : నామాట నమ్ము నాయనా! ఆ పిల్లకొచ్చిన భయం లేదు. వెళ్ళు త్వరగా.

దామో: సరే తాతా! వెళ్తున్నాను. (వెళ్లిపోవలెను.)

వైకుం : (విసుక్కుంటూ ప్రవేశించి విసుగుగా) వెంకన్నా !

వెంక : ఏం బాబూ !

వైకుం : ఎవరు నీతో మాట్లాడుతూవుంది ?

వెంక : ఎవరూ లేరండి. నేనే?

వైకుం: లేరూ?

వెంక : లేదయ్యా!

వైకుం: రాస్కెల్ (ఛెళ్ళున చెంపపైకొట్టి) అపద్ధం ఆడతావు. డొక్క చీలుస్తాను. జాగ్రత్త.

వెంక : (దుఃఖముతో) చీల్చండయ్యా! పెద్దవాణ్ణి. నిన్నూ, నీ పాపల్ని కడుపులో పెట్టుకొని కంటికి రెప్పలా

కాపాడుతున్న నన్నే కొడతావా? అవును నామంచి తనం ఎవరిక్కావాలి? నేను చెప్పేది ఎవరు వింటారు? నిజంగా నేను ద్రోహంచేయ సమకడితే (దిగమ్రింగి) కొట్టండిబాబూ! కొట్టండి. బతుకోసం బానిసత్వంలో మగ్గే నన్ను కొట్టక ఎవర్ని కొడతారు. నాకు తగినపనే చేశారు. నన్ను నేను తెలుసుకొనేటట్లు చేశారు.

వైకుం: ప్రతి వెధవా నాకు ద్రోహం చేశేవాడే.

వెంక : మాటలు జారుతున్నారయ్యా! యజమానులని ఎంతో సేపు ఓర్చాను. ఇష్టంలేకపోతే నౌకరీ మాని వేస్తాను.

వైకుం: మానేస్తావ్. ఆరోజే వైకుంఠయాత్ర చేస్తావ్...పెద్ద వాడివని, బుద్ధిమంతుడవని నమ్మితే...

వెంక : నమ్మితేనే కదబాబూ!...ఎవ్వరికైనా...చెట్టునీడను కూర్చొని మొదలు నరకటం, యింట్లోచేరి యింటి వాసాలు లెక్కించడం, ఆత్మీయుల్లా దరికిచేరి హంతకుల్లా గొంతులుకోసే వాళ్ళకు ఏ చీకూచింతా లేదు. నమ్మి సర్వచాకిరీచేస్తూ బ్రతుకుని నాశనం చేసుకొని బానిసత్వం చేస్తున్నా తప్పుగా కనుపిస్తుం దయ్యా! అది లోక సహజం.

వైకుం. ఊ... ఉపన్యాసాలు చాలించి వాకిలి దగ్గరికి అఘో రించు.

వెంక : చిత్తం బాబూ! (వెంకన్న వెళ్ళిపోతున్నాడు.)

వైకుం : (వెళ్తున్న వెంకన్నను చూచి) వెంకన్నా!

వెంక : (వెనక్కు తిరిగి దగ్గరకు వచ్చి) ఏం బాబూ ?

వైకుం: (పశ్చాత్తాపపడుతున్నట్లుగా) పెద్దవాడివి. నాకు కోపం తెప్పించటం దేనికి చెప్పు...

వెంక : అందుకు ఫలితం అనుభవించానుగా బాబూ!

వైకుం : ఏమీ అనుకోకు. చాల తొందరపడ్డాను. ఆవేశంలో వళ్ళు తెలిసిందికాదు. చూడు వెంకన్నా! నా చుట్టూ ఎందరో గూఢచారులు, మనల్ని దొరికితే నాశనం చేయాలనే శత్రువులు తిరుగుతూవున్నారు. ఏమీ అనుకోకు.

వెంక . అనుభవించినదానికి అనుకోవటం దేనికయ్యా?
(ప్రక్కకు వెళ్ళిపోయాడు.)

వైకుం : (చూస్తూ పైకి వెళ్ళాడు)
(కొద్దిసేపటికి దుర్గారావు మెట్లమీద నుండి దొర్లి పడ్డాడు. తిరిగి పైకిలేచాడు. ఇంతలో "ఢాం" అనే శబ్దము)

దుర్గా : అమ్మా! (అంటూ పడ్డాడు.)

వెంక : (బైటనుండి వచ్చాడు)
(వైకుంఠం, సేట్, డాక్టరు, ఇన్‌స్పెక్టరు వచ్చి మెట్ల మీద నిలచి చూచారు.)

వెంక : బాబూ ఏమిటీ ఘోరం?

వైకుం : ఈ వెధవని ఆ ప్రక్కనున్న నదిలో పారవేయ్. పీడ విరగడైపోయింది

[ అంతా వికృతంగా నవ్వారు. ]

( తెర )

## మూడవ రంగము

(అంతా రెండవరంగముసీను. తెరలేచేసరికి వైకుంఠం, సేట్, సదానందం, శివకాసి కూర్చుని వుంటారు. డాక్టర్ లేనిధైర్యం తెచ్చుకొన్నవాడిలా)

శివ : మనందరిముందూ వైకుంఠంగార్ని నేను ఓమాట అడగదల్చాను. ఏమంటారు?

సేట్ : సందేహం హెద్కు హడ్గు.

వైకుం. (తీవ్రంగా) ఏమిటామాట?

శివ : మీరు తీవ్రపడితే నేను మాట్లాడలేను. శాంతంగా ఉండాలి.

సదా: అవును.

వైకుం: చెప్పు.

శివ : నేను అడగబోయేది అపూర్వవిషయం. మిత్రద్రోహానికి సంబంధించినది. మనం డబ్బు దగ్గర శత్రువులం కారాదు. మనం ఎలా కలిశామో, ఏం చేశామో దానికి ప్రతిఫలంగా అనుభవించినదేమిటో అర్ధం కాలేదు. చివరకు విషయం తెలుసుకొని లోలోన కుళ్ళిపోయాం. ఏడ్చాం. నోరెత్తటానికి భయం. నిజం మాట్లాడినవాడికి దుర్గారావుగతి పడుతుందని అంతా భయపడుతున్నారు.

వైకుం: ఉపోద్ఘాతం దేనికి? వున్నదున్నట్లుచెప్పు.

సేట్ : హదీమాట.

సదా: చెప్పండి భయపడతారేం?

శివ : భయంకాక మరేమిటుంటుంది? మనం ఎక్కడున్నాం? ఎవరిదగ్గర? నోరువిప్పితే మృత్యువు కనుపిస్తుంది. యిక మీాదట దారుణాలు జరుగరాదు. వైకుంఠంగారు క్షమించాలి. (కుర్చీలోంచి లేచి) మేము చావటానికి రాలేదు. బ్రతకటానికి వచ్చాం. ముఖ్యంగా సుఖపడ టానికి. ఈ సుఖంకన్నా, బ్రతుకు మహా అయోమయావస్థలో పడిందిప్పుడు.

వైకుం: ఏమిటీసోది? విషయం చెప్పండి.

సేట్ : మాకు బహుత్ కామ్వుంది. జల్దీబోలో!

సదా: చెప్పండి.

శివ : (వైకుంఠంగారి దగ్గరకొచ్చి భయంగా) ఆ...మీావద్ద పిస్టలుంటే దాన్ని దూరంగా పారవేయండి. అంతవర దాక నేను విషయం చెప్పలేను.

వైకుం: డాక్టర్ (క్రోధంగా)

సేట్ : హైకుంఠమ్గార్ జర్రా ఠైరో! హడ్గండి డాక్టర్ సాబ్.

శివ : వారినాపిస్టలు తీసి దూరంగా పారవేయమనండి.

వైకుం: (క్రౌర్యంగా చూచాడు)

సదా : (నవ్వి) పిరికితనం.

శివ : (కుర్చీలో కూర్చొని) పోనీ నీకు తెలుసుగా, నువ్వే చెప్పు ఇన్స్పెక్టర్.

సదా : నేనా! నాకేమీా తెలియదు క్షమించాలి. నేను వెధవ డబ్బుకోసం చావదలచలేదు.

శివ : అబద్ధం-వంచన- నిజాన్ని దాస్తావెందుకు ?

సదా : నిజాన్ని దాయటం నాకు చాతగాదు. కాని నిజాన్ని చెప్పటం నా అభిమతం కాదు. నంబర్ త్రి నిజం మాట్లాడవలసిన ప్రదేశంవుంది, నెంబర్ ఫోర్...

వైకుం : నోర్మ్యుయ్ ఫూల్, ఇడియట్...గెటవుట్ ఫస్టు !

సేట్ : వైకుంఠంసాబ్ కొంచెం శాంతం వహించాలా... బోలో డాక్టర్ !

వెంక : (వచ్చి ప్రక్కగా నిలబడతాడు కనబడకుండా)

శివ : చెప్తా ! ఆ రాత్రి... ఆ నిశీధసమయములో ... ఆ భయంకర క్రూరమృత్యువు. రంగాపురం జమీందారు తాలూకు పదిలక్షల ధనం, వెండి, బంగారు-జవాహర్ సర్వం మన మధ్యకు రాకుండానే మాయమయ్యాయి.

వెంక : (ప్రవేశించి) పిలిచారా బాబూ.

వైకుం : లేదు. వెళ్ళు.

వెంక : (వెళ్ళకుండా అక్కడే ఉండాలి.)

వైకుం : ఈ కల్పిత కథనా నువ్వు చెప్పేది ?

శివ : సాక్ష్యం వుంది.

వైకుం : ఎవరు తీసుకున్నట్లు ?

శివ : మీరు.

వైకుం : నేనా ?

శివ : అవును.

వైకుం : (కోపంగా) డాక్టర్ !

శివ : బెదరించకండి! మమ్మల్ని భయపెట్టకండి. మా నోళ్ళు మూసి మా లాభాల్ని తమరే అపహరించకండి. మాకు న్యాయం కలుగచేయండి.

వైకుం: డాక్టర్...

శివ : (కుర్చీలోంచి లేచి) డాక్టరునే మాట్లాడుతున్నాను. నిన్నటిదినం దుర్గారావు చావుకు కారణం చెప్పండి వైకుంఠంగారు. నేను దుర్గారావులాంటి అమాయకుణ్ణి గాదు. నేను తగిన జాగ్రత్తలోనే ఇక్కడికి వచ్చాను. మీరు బెదరించి నాపైన క్రూరదర్పం ప్రయోగించి నన్ను యిక నోరు మూయించలేరు. మాకు నిజింకావాలి. పాపాన్ని మేమంతా పంచుకోవటం ధనాన్ని మీరు దక్కించుకోవటం ధర్మకాదని మనవి చేస్తున్నాను (కుర్చీలో కూర్చోవల)

సేట్ : పత్యం...పత్యం...మాకు బడాదిల్ కుష్ హైంది.

సదా : పదిలక్షలు...పదిలక్షల రూపాయలు మా కళ్ళబడలేదు. అందుకే నా పెళ్ళాం నన్ను తెగతిట్టింది.

వైకుం: ఈ విషయం నీ పెళ్ళాంతో దేనికి చెప్పావ్?

సదా : బాగుంది. ఏవిషయం నేను దాచను. అసలు నా పెళ్ళాం పర్మిషన్ లేకుండా ఒక్క అడుగుకూడా వెయ్యను.

వైకు : ఓరి దరిద్రుడా!

సదా : దరిద్రం లేకుండా మనిషెక్కడున్నాడో చెప్పండి. ఆ దరిద్రభారం మోయలేకనేగదా నా ఆత్మను చంపుకొని మీవలలో చిక్కుకుంది.

సేట్ : హారే హెంద్గుబేయ్ లడాయి చేస్తావ్? డాక్టర్ సాబ్ హిందు...పదీలక్షల్ డబ్బుసంగతి చెప్పు హింటామ్. క్యాజీ వైకుంఠమ్ సాబ్!

వైకుం: వట్టిది. దగా. ఫాల్సుస్టేటుమెంబు డాక్టగారిస్తున్నారు.

శివ : కాదు. నిజం ప్రూఫు చేస్తాను.

సదా : అవును. దాని ఆచూకి అంతా తీశాం. జమీందారు చనిపోయిననాటి రాత్రి పదిలక్షలు బ్యాంకునుండి తెచ్చాడు.

వైకుం: (కోపంతో) సదానందం.

సదా : బెదిరించకండి. యిక ప్రాణం పోయినాసరే! ఆ విషయం తేల్చుకుంటాము.

వైకుం: అదే చూపిస్తాను.

శివ : కాదు చూస్తాం.

సదా: మేము నోరువిప్పితే.....

వైకుం : అంతటి వాళ్ళయ్యారన్నమాట.

శివ : మా భాగాల విషయం తేల్చండి ముందు.

వైకుం: అదే చెప్తున్నాను. నాకా డబ్బువిషయం తెలియదని మరోసారి చెప్తున్నాను.

సేట్ : హేమ్ట్రిాషెప్తావ్ హైకుంఠం! మాకీ హెధవల్ని చేస్తావ్?

సదా : మీకు అడుగులకు మడుగులొత్తి, మీరు చేయమన్న ఘోరవాది నరకకృత్యాలు చేశాము. మమ్మల్ని దుర్గంధంలో ముంచి మీరు మాకు ద్రోహంచేస్తారా?

వెంక : (వెళ్ళిపోతాడు.)

వైకుం : వెళ్ళండి. (కుర్చీలోంచిలేచి) ఒక్క కానీ ఇవ్వను. చేశారట. చేశారు. అధికంగా వాగితే ప్రేల్చిపార వేస్తాను. వర్తిసుంతలు. మీ అందరి ప్రాణాలు నా చేతిలో ఉన్నయ్. నా దయాభిక్షంకోసం కుక్కల్లా వాకిటముందు కావిలి గాచిన మీరు, భుక్తికోసం కాకుల్లా నా చుట్టూమూగిన మీరు చివరకు నన్నే నాశనంచేయ సమకడతారా ? నేను తలుచుకుంటే మిమ్మల్నందర్నీ జైలుపాలు చేయగలను. జాగ్రత్త.

సేట్ : హారే హేమ్మీ కోపం సేస్తావ్ ! హైకుంఠం నీదిమాట మాకు నమ్మకం హుంది.

సదా : సరే... నేను వస్తానండి. (కుర్చీలోంచి వెళ్ళబోయే సరికి సుధాకర్ వచ్చాడు.)

సుధా : (ప్రవేశించును.)

వైకుం : ఎవరు నువ్వు !

సుధా : [అందరివంక చూచి) నేను దుర్గారావు బావమరదిని. రెండురోజులనుండి దుర్గారావు ఇంటికి రాలేదు. వారిక్కడున్నారని...

వైకుం : యిక్కడెందుకుంటాడు ?

సుధా : మా అక్కయ్య చెప్పింది. మీ దగ్గర కొస్తాడని.

వైకుం : యిక్కడకు రాలేదు. మేము అతన్నిచూచి పది రోజులయింది. అతను ఇంటికొస్తే ఇక్కడికి రమ్మ న్నానని చెప్పండి.

సుధా : అలాగే చెప్తాను. (అందర్నిచూస్తూ) వస్తానండి (బయటకు వెళ్లిపోవల)

సేట్ : హారే హెంవ్గుటేయ్ లడాయి చేస్తావ్? డాక్టర్‌సాబ్ హిద...పదీలక్షల్ డబ్బుసంగతి చెప్న హింటామ్. క్యాజీ వైకుంఠమ్‌సాబ్!

వైకుం: వట్టిది. దగా. ఫాల్సుస్టేటుమెంబు డాక్టగారిస్తున్నారు.

శివ : కాదు. నిజం ప్రూవుచేస్తాను.

సదా : అవును. దాని ఆచూకి అంతా తీశాం. జమీందారు చనిపోయిననాటి రాత్రి పదిలక్షలు బ్యాంకునుండి తెచ్చాడు.

వైకుం: (కోపంతో) సదానందం.

సదా : బెదిరించకండి. యిక ప్రాణం పోయినాసరే! ఆ విషయం తేల్చుకుంటాము.

వైకుం: అదే చూపిస్తాను.

శివ : కాదు చూస్తాం.

సదా: మేము నోరువిప్పితే.....

వైకుం : అంతటి వాళ్ళయ్యారన్నమాట.

శివ : మా భాగాల విషయం తేల్చండి ముందు.

వైకుం : అదే చెప్తున్నాను. నాకా డబ్బువిషయం తెలియదని మరోసారి చెప్తున్నాను.

సేట్ : హేమ్టిూహెప్తావ్ హైకుంఠం! మాకీ హెధవల్ని చేస్తావ్?

సదా : మీకు అడుగులకు మడుగులొత్తి, మీరు చేయమన్న రౌరవాది నరకకృత్యాలు చేశాము. మమ్మల్ని దుర్గంధంలో ముంచి మీరు మాకు ద్రోహంచేస్తారా?

వెంక : (వెళ్ళిపోతాడు.)

వైకుం: వెళ్ళండి. (కుర్చీలోంచి లేచి) ఒక్క కానీ ఇవ్వను. చేశారట. చేశారు. అధికంగా వాగితే ప్రేల్చిపారవేస్తాను. వర్తిసుంతలు. మీా అందరి ప్రాణాలు నా చేతిలో ఉన్నయ్. నా దయాభిక్షంకోసం కుక్కల్లా వాకిటముందు కావిలి గాచిన మీారు, భుక్తికోసం కాకుల్లా నా చుట్టూమూాగిన మీారు చివరకు నన్నే నాశనంచేయ సమకడతారా ? నేను తలుచుకుంటే మిమ్మల్నందర్నీ జైలుపాలు చేయగలను. జాగ్రత్త.

సేట్: హారే హేమ్మీా కోపం సేస్తావ్ ! హైకుంఠం నీదిమాట మాకు నమ్మకం హుంది.

సదా: సరే... నేను వస్తానండి. (కుర్చీలోంచి వెళ్ళబోయే సరికి సుధాకర్ వచ్చాడు.)

సుధా: (ప్రవేశించును.)

వైకుం: ఎవరు నువ్వు !

సుధా: [అందరివంక చూచి) నేను దుర్గారావు బావమరదిని. రెండురోజులనుండి దుర్గారావు ఇంటికి రాలేదు. వారిక్కడున్నారని...

వైకుం: యిక్కడెందుకుంటాడు ?

సుధా: మా అక్కయ్య చెప్పింది. మీా దగ్గర కొస్తాడని.

వైకుం: యిక్కడకు రాలేదు. మేము అతన్నిచూచి పది రోజులయింది. అతను ఇంటికొస్తే ఇక్కడికి రమ్మన్నానని చెప్పండి.

సుధా: అలాగే చెప్తాను. (అందర్నిచూస్తూ) వస్తానండి (బయటకు వెళ్ళిపోవలె)

సుజా : (వచ్చి) వెంకన్నా !

వైకుం: బయటవున్నాడు పిలవనా!

సుజా : అక్కర్లేదు. (అందర్నీచూచి లోపలికి వెళ్ళబోతూ) మీతో పనివుంది.

వైకుం: వస్తున్నా (అందరివంక తిరిగి) వెళ్ళిరండి. ఈరాత్రికి మీరంతా వస్తారుగా?

సేట్ : వస్తాం వస్తాం! (లేచి సుజాతవంకచూస్తూ వెళ్ళుతాడు) (అందరూ వెళ్ళిపోతారు )

సుజా : ఆడదానివంక ఏంటలా దెయ్యంపట్టినవాడిలా చూస్తాడు?

వైకుం: వారికి నీమీద జాలి.

సుజా : జాలి...నన్నుగురించి అందరికీ జాలే ! ఏమండీ మా అక్కయ్య రాలేదే!

వైకుం: వస్తుంది. ఆమె భర్తగారికి తెలియకుండా రావాలిమరి! మీరంటే ఆయనకు సరిపడదు. మీదగ్గరకు వచ్చిందని తెలిస్తే చంపేస్తాడు.

సుజా : చంపేస్తాడు. దేనికండి? ఈ అబద్ధాలు చెప్పటం? నన్ను అసలు దేనికి తెచ్చారో చెప్పండి.

వైకుం: బాగుంది. మీ అక్కయ్య తీసుకురమ్మంది. తీసుకు కొచ్చాను.

సుజా : అక్కయ్యా! అక్కయ్యా! మీ మాయనాటకం చాలించండి. అక్కయ్యా వద్దూ, అద్వాన్నమూ వద్దు. నన్నింటికి పంపించెయ్యండి.

వైకుం : సుజాతా తొందరపడకు! మీఅక్కయ్యను చూద్దువు గాని, ఇప్పుడు నిన్ను తిరిగి పంపిస్తే మీఅక్కయ్యతో నేను చివాట్లు తినాలి.

సుజా : ఏమన్నా తినండి. ఇక నేనొక్క క్షణం వుండను. నాలుగైదు రోజులనాడు ఇంటివద్ద నుండి నాన్నతో చెప్పనీయకుండ నన్ను మోసంచేసి తీసుకవచ్చి యీ దయ్యాలకొంపలో బంధిస్తారా? (ఏడ్వసాగెను)

వైకుం : బంధించానా? పిచ్చిదానా! ఈ యింటికి రాణిలా స్వేచ్ఛగా కమ్మని తిండి, బట్టా, డబ్బూ ఏదికావా లంటే అది సమకూర్చాను. ఇంకా నన్ను చెడ్డగా భావిస్తే ఎలా?

సుజా : మీ తిండీ గుడ్డా ఏమీవద్దు. అంత గతిలేకపోతే అడుక్కతింటాను.

వైకుం : తప్పమ్మాయి! నా కంఠంలో ప్రాణముండగా నువ్వా నీచపుపని చేయలేవు. నాకా భార్యాపిల్లలు లేరు. బోలెడు ఆస్థి వుంది. లక్షలున్నాయి. దేనికివన్నీను? రేపు వెంకన్నను పంపి మీనాన్ననే యిక్కడకు రప్పించాలనుకొంటున్నా. మీకు మాత్రం అక్కడేముంది? ఆ పాడుదరిద్రంలో దేనికి? ఇక్కడ సుఖంగా మీ నాన్న, మీ అక్కయ్యా, నువ్వూ...

సుజా : (పలకదు—ఏడుస్తుంది.)

వైకుం : ఆ మరిచిపోయాను వుండు. నీ కోసం కాశ్మీరు, షిల్లాంగ్, జపాన్, పారిస్, బెనారిస్ మొదలైన దేశాలనుండి సరిక్రొత్త చీరెలు తెప్పించాను. పైగా

ఓ మాంచిరవ్వల వడ్డాణం, డైమండ్ నెక్‌లెస్, బంగారపు గాజులు, రవ్వలతో, నవరత్నాలతో పొదిగిన ఉంగరాలు తెప్పించాను. తెస్తానుండు.

సుజా : నాకేమీ వద్దు. యివన్నీ పెట్టి నన్ను మోసంచేద్దామని కాబోలు ?

వైకుం : అయ్యో రామా ! ప్రతిదీ నువ్వు అలా అంటే ఎలా సుజాతా ? నేను మిమ్మల్ని గురించి, మీ అక్కయ్యని గురించి ఎలా బాధపడుతున్నానో, ఎంత లోలోన కుళ్ళిపోతున్నానో మీకెలా తెలుస్తుంది? మీ తండ్రిచేసిన అన్యాయానికి ఆ పిల్ల అస్వతంత్రురాలై, వీధి ముఖం చూడ్డానికీ, మిమ్మల్ని చూడటానికి నోచుకోక, ఆ నాల్గుగోడలమధ్య, ఆ చీకటి పరదాల్లో రాత్రింబవళ్ళు కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తోంది. మీ నాన్న కన్నప్రేమైనా చూడకుండా అంతటి దురన్యాయం చేస్తే అడిగినవాళ్ళు లేరు. నేను పరాయివాణ్ణనేగా నా మాట నమ్మంది...! అవును నాకు బుద్ధిలేదు. ఆ దిక్కులేని పిల్ల కన్నీరు పెట్టింది గదా అని కరిగిపోయి, జాలిపడి, కష్టం సుఖం అనకుండా, మీ నాన్న చేతకూడా తిట్లు తిని నిన్ను తీసికొస్తే, చివరకు రావలసిన మాటలే వచ్చాయి. నాకు తెలుసు వస్తయ్యని. నేను పనికిమాలినవాణ్ణి కావటం వల్ల అందరి చేతా యిలా చివాట్లు, చెప్పుదెబ్బలు తినాల్సి వచ్చింది, వెంకన్నా, వెంకన్నా...!

వెంక : (వచ్చి) అయ్యా !

వైకుం : వెళ్ళి బండితీసుకురా యీ సుజాతను తీసికెళ్ళివాళ్ళ నాన్న దగ్గర దిగవిడిచి వద్దువుగాని.

వెంక : నేనా అయ్యా ?

వైకుం: నువ్వే. పరుగెత్తు.

వెంక . ఇక్కడ దగ్గర్లో బళ్ళు లేవుగా అయ్యా!

వైకుం: బళ్ళు లేకపోతే కారుతీసుకరావోయ్.

వెంక : కారుకు చాల డబ్బు అవుద్దయ్యా! సాయంకాలం రిపేరుకు వెళ్ళిన మన కారువస్తుందికదయ్యా!

వైకుం: నీకాడు చెపుతుంది! బుద్ధిలా! ఎన్నిసార్లు చెప్పాను. ఎదురు చెప్పవద్దని

వెంక : చిత్తం. పోతున్నానయ్యా. (వెళ్ళబోయాడు)

సుజా : వెంకన్నా!

వెంక : (వెనుతిరిగి) ఏంమ్మా?

సుజా : వద్దులే ఊరుకో!

వైకుం: కాదులే వెళ్ళిరా.

వెంక : వెళ్ళనా అమ్మా?

సుజా : వద్దులే నీపనిచూచుకో! (లోపలికి వెళ్ళుతుంది.)

వెంక : ఏందయ్యా ఈ గోల?

వైకుం: ఏమీలేదు. వెళ్ళు. (నవ్వి) నేను బజారుకు వెళ్తున్నా, డ్రైవర్ని కారు సిద్ధంచేయమను.

వెంక : చిత్తం (అంటూ బయటికి వెళ్ళిపోయాడు.)

వైకుం: (లోపలికివెళ్ళి తిరిగి కొద్దిసేపటిలో వచ్చి బయటికి వెళ్ళిపోయాడు)

వెంక : (స్టేజీమీదకు వచ్చాడు.)

దామో: (ప్రవేశించి) వెళ్ళిపోయినట్టేనా తాతా!

వెంక : వెళ్ళాడు బాబు!

దామో: సుజాత ఎక్కడ?

వెంక : లోపలవుంది. తమరు చప్పున మాట్లాడి బయటకురండి. మరలా వైకుంఠంగారొస్తే ప్రమాదం. నేను వాకిలి దగ్గర ఎదురు చూస్తూఉంటాను. (వెళ్ళాడు)

సుజా . (లోపలినుండే) ఎవరు వెంకన్నా ఆ వచ్చింది? (బయటికివచ్చి చూచి) ఓ. మీరా!

దామో: ఆ. . . నేనే!

సుజా : మళ్ళీ కనిపించకుండా పోయారేం?

దామో: పోలేదు ఈ కత్తెరబోనులో కేకలు పెట్టటానికి వీల్లేక ఊరుకున్నాను.

సుజా : (నవ్వి) కూర్చోండి.

దామో: (కూర్చుంటూ) థ్యాంక్స్.

సుజా : దాహం కావాలా ?

దామో: ఇస్తే వద్దంటానా ?

సుజా : దాహంకాకపోయినా నేనిస్తే త్రాగుతారన్నమాట?

దామో: తప్పకుండా ! అసలు యీ ఎండిపోయిన మోడుకు ఎన్ని నీళ్లుపోసినా చాలటం లేదు.

సుజా : (నవ్వి) మంచివారే. . .!

దామో: (నవ్వి) మీరైనా నా మంచితనం గుర్తించారు. సంతోషం.

సుజా : మీరెక్కడుంటున్నారు ?

దామో: ఈ భూమ్మీద. అంటే కొంపగోడిలేనిచోట, చెట్లు చేమా లేనిప్రదేశంలో, ఎండావానా దండిగా వచ్చే చోట, చాటు గోడలు లేనిచోట, స్థిరచరాస్తులు లేని చోట, కుబేరులుండే ప్రదేశం కాదు, కుచేల సంతతి వుండేచోట.

సుజా: అంటే బజారులోనా ?

దామో: అలాంటిదే ఆ ప్రదేశం. అటు యిల్లూకాదు యిటు వీధీ కాదు.

సుజా: అయ్యో పాపం !

దామో: దయిగలవారికి దానం చెయ్యాలనే బుద్ధి వుడుతుంది. ముల్లోకాలు దానం చేసినా తృప్తితీరదు.

సుజా: మీరు రోజూ వస్తూవుంటే నాకెంతో ధైర్యంగా వుంటుంది.

దామో: మీరు ఎక్కువ రోజులు యిక్కడ వుండకూడదు.

సుజా: ఏం! ఎందుకని ?

దామో: అది తరువాత చెప్తాను. మీరు వెళ్ళిపొండి. యిక్కడనుండి త్వరగా వెళ్లిపొండి.

సుజా: వెళ్ళమంటారా ?

దామో తప్పకుండా వెళ్ళాలిసిందే !

సుజా: మా అక్కయ్యను, మిమ్ములను చూడాలని వున్నాను.

దామో: నాకోసం యీ కసాయికొంపలో బాధపడకండి. ఇక మీ అక్కయ్యంటారా...

వెంక: (ప్రవేశించి) బాబూ వారొచ్చే వేళయింది.

దామో: వెళ్లొస్తున్నా వెంకన్నా ! వస్తా సుజాత! (కుర్చీలోంచి లేచి) వెంకన్నా! సుజాత నీ చేతుల్లోవుంది. జాగ్రత్త. (రెండడుగులు ముందుకు వెళ్ళి) ఆ...నాకో విషయం తెలిసింది. (చెప్పబోయి ఆగి) సరే యిక్కడెందుకు? రా అలా బయటకెళ్దాం. (సుజాతతో) వస్తా...టా... టా...!

దామో, వెంక : (వెళ్లిపోయారు.)

సుజా : (వారెళ్లినవంకే చూస్తూ నిలబడి ఉంటుంది.)

ధర్మ : (చాల కోపంగా ప్రవేశం)

సుజా : (ధర్మన్ననుచూచి ఆత్రంగా) నాన్నా! నాన్నా! (అంటూ దగ్గరకు పరుగెత్తుకొచ్చింది.)

ధర్మ : (కోపంతో) నాన్న! (ఛెళ్లున చెంపమీదకొట్టి) దౌర్భాగ్యురాలా! ఎందుకొచ్చావిక్కడికి?

సుజా : (ఏడుస్తూ భయంతో చెప్పదు)

ధర్మ : చెప్పవేం?

సుజా : (ఏడుస్తూ) అక్కయ్యను చూపిస్తానని...

ధర్మ : అంటేవచ్చావ్! అంతేనా?

సుజా : అంతే నాన్న!

ధర్మ : ఆమాట నాతో దేనికి చెప్పలేదు?

సుజా : నువ్వు రానివ్వవని చెప్పాడు.

ధర్మ : మరి చూచావా అక్కయ్యను.

సుజా : లేదు.

ధర్మ : ఏం?

సుజా : అక్కయ్య మొగుడు రానివ్వలేదట.

ధర్మ : రానిస్తాడు... సుజాతా! నువ్వు చిన్నపిల్లవుకావు. వయస్సు వచ్చినదానవి. తెలివిగలదానివి. అభం, సుభం తెలియకుండా ఆ దుర్మార్గుడితో, తండ్రినన్న వాడిని నేనున్నాననిగూడా మరచిపోయి వస్తావా? (బాధగా) మీకోసం నా జీవితం ధ్వంసంచేసుకున్నాను. మీకోసం ఎన్నో కష్టాలు, నష్టాలు యీ గుండెమీద భరించాను. ఆనాడు మీ అక్కయ్యకుగూడ యీ నీచుడు మీ అన్నయ్య వున్నాడనీ, వాణ్ణి నేను యింట్లోంచి వెళ్ళగొట్టానని మిమ్మల్ని చూడాలనీ, ఏడుస్తున్నాడనీ ఏవేవో కబుర్లు చెప్పి తీసుకవచ్చాడు. ఆ పిల్లను ఏం చేశాడో యీ నాటికీ నాకు తెలియదు.

సుజా : నాన్నా ! (చేతులు ముఖానికి కప్పుకొని ఏడ్చింది)

ధర్మ : నాన్న... నాన్నకు యింత దుర్గతి పడుతుందని యెన్నడూ తలంచలేదు. మీ అమ్మ చనిపోయినందుకు గుండె పగిలి ఏడుస్తూవుంటే నువ్వు ఈ రాక్షసుడి వెంట వస్తావా ? ఈ వృద్ధాప్యంలో దేనికమ్మా ? నీ తండ్రిని యిలా ఏడ్పించటం ? (కన్నీరు తుడుచు కోవాలి.)

సుజా : నాన్నా ! (తండ్రిని కౌగలించుకొని) పొరబాటు చేశాను. క్షమించునాన్నా ! ఇకనుండి నీ మాట తప్పను (ఏడ్వవలె)ను

ధర్మ . రామ్మా ! రా ! (అని సుజాతను చేతితో పట్టుకొని బయలు దేరారు.)

వైకుం : (ప్రవేశించి) అప్పుడే వెళ్ళిపోతున్నావేం ధర్మన్నా ? రావటమెప్పుడు ? పోవటమెప్పుడు ? (నవ్వి) రండి తీరిగ్గా వెళ్ళొచ్చు. అసలు నేనే నిన్ను రమ్మని ఉత్తరం వ్రాద్దామనుకొని అమ్మాయితోకూడ చెప్పాను. ఇంతలో నువ్వే వచ్చావ్ !

ధర్మ : (గంభీరంగా) అక్కర్లేదండి వెళ్ళాలి.

వైకుం : ధర్మన్నా ! ఆవేశపడకు ! బ్రతకటం నేర్చుకోవాలోయ్ ! నీ జీవితం ఎలాగో కష్టాల్లో గడిపివేశావ్ ! పాపం యీపిల్లనన్నా సుఖంగా బ్రతకనివ్వు ! అయినా ఈ యిల్లు నీది కాదా ? ఈ ఆస్తి నీది కాదా ? వుండవోయ్ నీవుకూడ యిక్కడే! ఆనందంగా అనుభవించు ఆ పిల్లను ఒక ఇంటిదాన్ని చెయ్యి. యీ వేళనుండి నా సర్వస్వం నీదేననుకో !

ధర్మ : నాకేమీ వద్దు. నన్ను వెళ్ళనీ.

వైకుం : ఆలోసించి ధర్మన్నా ! సిరిరామోకాలొడ్డకు. మీ అమ్మాయి ముఖమైనా చూచి వుండిపో. ఒకనాడు నువ్వు నాకు చేసిన వుపకారానికి ప్రత్యుపకారం చేయాలనే నా తాపత్రయం.

ధర్మ : నా కాళలు పెట్టకు. నన్ను బుద్ధిహీనుడ్ని చేయకు ... నన్ను వెళ్ళనీయ్.

వైకుం: ధర్మన్నా! మూర్ఖం మంచిదికాదు. అర్థంచేసుకో!

ధర్మ : అర్థంచేసుకున్నాను. ఒక్కక్షణం ఈ పాపిష్టి ప్రదేశంలో ...మీ ఉరివుచ్చుల్లో వుండను.

వైకుం: అంతేనా?

ధర్మ : అంతే!

వైకుం: సరే? ఆ అమ్మాయిని విడిచి నువ్వెళ్ళిపోవచ్చు.

ధర్మ : ఆ అమ్మాయిని దేనికి విడిచి వెళ్ళాలి?

వైకుం: ఆ అమ్మాయిని పెంచేయోగ్యత, తాహతు నీవద్దలేవు కాబట్టి. అందుకు నీవు అర్హుడవుకాదు కాబట్టి. ఆ అమాయకురాలి తండ్రిని చంపిన హంతకుడవు కాబట్టి.

సుజా : (దీనంగా తలపైకెత్తింది.)

ధర్మ : వైకుంఠం. (గంభీరంగా)

వైకుం: వైకుంఠాన్నే చెపుతున్నాను. నువ్వాపిల్ల తండ్రివి కాదు కాబట్టి.

సుజా : (ఏడుస్తూ ధర్మన్నవైపు చూచి) నాన్నా! నువ్వు మానాన్నవుకావా? మా నాన్నను చంపావా? (ముఖం కప్పుకొని ఏడ్చింది.)

ధర్మ : ఓరి దుర్మార్గుడా ?

వైకుం : నేనా దుర్మార్గుడిని? ఆనాడు నువ్వు కన్నతండ్రికంటే మిన్నగా చూచే ఆ పిల్లతండ్రి వద్ద నౌకరీచేస్తూ, ఆయన ఉప్పు, పులుసూతింటూ, ఆయన గుట్టుమట్టులను తెలుసుకుంటూ సమయం కనిపెట్టి ఆ జమీందారుని, ఆయన భార్యను చంపి పదిలక్షల రూపాయలతో పారిపోతావా స్వామిద్రోహి ? ప్రభు హంతకుడా? మర్యాదగా వెళ్ళు యిక్కడినుండి. లేకపోతే నిన్ను యీ క్షణమే పోలీసుల కప్పగిస్తాను.

ధర్మ : అప్పగిస్తావ్ ! అప్పగించు. నా బొందిలో ప్రాణముండగా యీ పిల్లకు అపకారం జరగనివ్వను. ఆ పెద్ద పిల్లకు యిలాగే అన్యాయం చేశావ్ ! ఇప్పుడు ఈ పిల్లను ఏం చేయాలని ? నేను చంపానా నాస్వామిని? నేను అపహరించానా ధనాన్ని ?

వైకుం : ధర్మన్నా నన్ను నిందించకు. పోలీసులు నిన్ను యిప్పటికీ గాలిస్తున్నారు. నేను నోరు విప్పితే నాశనమైపోతావు. యికనైనా బుద్ధిగా వెళ్ళి బ్రతుకు. నాస్నేహితుడు, ఆత్మీయుడు, నాబంధువైన ఆ ఉదారహృదయుడికి యీ పిల్లను ఇచ్చి ఒక యింటిదాన్ని చేసి నా సర్వస్వం అర్పించి నా మిత్రునిఋణం తీర్చుకుంటాను.
(కళ్ళవెంట నీళ్ళు పెట్టుకున్నాడు కపటంగా.)

ధర్మ : ఓరి పశువా ! ఇప్పుడీ నేరాలన్నీ నా మీద రుద్దుతున్నావా ? నేను నాశనమైనా సరే ఆ పిల్లను విడిచిపెట్టను. సుజాతా ! రా ! వెళ్దాం.

సుజా : నేను రాను.

ధర్మ : రావూ ?

సుజా : రాను. నువ్వు కన్నతండ్రివనుకున్నాను. కసాయివాడివనుకోలేదు. నా తలిదండ్రులను చంపి (ఏడుస్తూ) మాసర్వస్వం దోచుకువెళ్ళిన దొంగతో నేనురాను... వెళ్ళు.

ధర్మ : పాపిష్టిదానా ! వంచకుల మాటల్లో పడి నన్నే నిందిస్తావా ? రా... (సుజాత చెయ్యి పట్టుకొని లాక్కువెళ్ళుతూంటే.)

వైకుం : (ప్రక్క నే ఉన్న పూలకుండితో ధర్మన్న నెత్తిన కొడతాడు.)

ధర : అమ్మా (పడిపోతాడు.)

సుజా : నాన్నా ! ధర్మన్న మీద పడి ఏడుస్తుంది.)

( తెర )

# నాల్గవ రంగము

[అంతా వెనుకటిసీనే - సుజాత కూర్చొని ఏడుస్తూ వుంటుంది. దామోదరం వచ్చాడు )

దామో: (ప్రవేశించి) సుజాతా!

సుజా : (కన్నీరు తుడుచుకొని) మీరా! రండి.

దామో : నీకు జరిగిన అన్యాయం విన్నాను. వెంకన్న తాత నాకంతా చెప్పాడు.

సుజా : చెప్పాడా? మా నాన్నా, మా అమ్మా, మా అక్కయ్యా మా!సర్వస్వం నాశనమై పోయిందండి.

దామో: నిన్ను పెంచిన ఆ ధర్మన్న ఎక్కడున్నాడు?

సుజా : ఆ పైగదిలో బంధించాడు వైకుంఠంగారు.

దామో: ధర్మన్నే చంపాడంటే నువ్వు నమ్మావా?

సుజా : అవును, అతను ఒప్పుకున్నాడు

దామో: చాల పొరపాటు చేశావు సుజాతా! నిన్నుకనక పోయినా, నిన్నూ, మీ అక్కయ్యనూ, పెంచి పెద్ద వాళ్లను చేసిన ఆ ధర్మాత్ముణ్ణే నువ్వు అనుమా నించావా? అతను చంపేవాడైతే మీ నాన్నను, మీ అమ్మను చంపి ఆస్తిదోచుకు వెళ్లేప్పుడు మీరు చాలా చిన్నపిల్లలు. మిమ్మలను ఎందుకు తీసుకెళ్లాలి? ఎందుకు పెంచాలి? మీ కోసం తన సర్వస్వం దేనికి పాడుచేసుకోవాలి?

సుజా: అంతేనంటారా? అతను మంచివాడే నంటారా?

దామో: కాదనటానికి నాకు నోరురావటంలేదు సుజాతా! నేను చెపుతావిను.

సుజా : మీకు తెలుసా?

దామో: కొంతవరకు తెలుసు! ఇప్పుడే దుర్గారావుభార్య దగ్గరకు వెళ్ళివస్తున్నాను. ఆమె భర్తను మన కళ్ళ ముందే చంపాడా? అతన్ని దేనికి చంపాడో తెలుసా?

సుజా : నాకేం తెలుసు?

దామో : వైకుంఠం, సేట్, డాక్టరు, శివకాశి, దుర్గారావు వీళ్ళంతా ఓ బంధిపోటుముఠా! వీళ్ళంతా సంఘంలో పెద్దమనుష్యులుగా తిరుగుతున్నారు. ఆ సేట్ డబ్బు పెడతాడు. వైకుంఠం నీలాంటి అనాధల్ని తీసుక వస్తాడు. దుర్గారావు యునైటెడ్ యిన్సూరెన్సు కంపెనీకి ఏజంటు. అతను మనలాంటివార్ని అంటే వైకుంఠం తెచ్చిన వాళ్లని అందులో పాలసీ కట్టించి మెంబర్లుగా చేర్పిస్తాడు. డాక్టరు శివకాశి ఆ కంపెనీ డాక్టరు కాబట్టి, ఈ దొంగల్లో ఒకడు కాబట్టి సర్టిఫికెట్లు యిస్తాడు. సదానందం యిన్సూరెన్సు యిన్స్పెక్టరు గాబట్టి అతను సర్టిపై చేస్తాడు.

సుజా : అమ్మో పెద్దకధే వుందే!

దామో: ఆ తరువాత ఆ చేరిన మనలాంటి అనాధల్ని దగ్గరకు తీసి ఏక్షణమో మనచేత సంతకం పెట్టించుకుని క్రమంగా స్లోపాయిజన్ యింజక్షన్ల ద్వారా చంపేస్తారు. ఆ డబ్బు కాజేస్తారు. మీ అక్కయ్యను చంపి ఆ మెద్వారా రెండు లక్షలు కాజేశారు.

సుజా : (ఏడ్చింది.)

దామో: దుర్గారావు శవాన్ని ఈ ప్రక్క నదిలో పార వేశారు. దాన్ని పోలీసులు పట్టుకున్నారు. దుర్గారావు భార్య పోలీసు రిపోర్టిచ్చింది. బహుశా వాళ్లంతా ఈరాత్రే సిలోన్ పారిపోవటానికి, నిన్ను వాళ్ళ వెంట లాక్కుపోవటానికి నిర్ణయించుకున్నారట.

సుజా : (భయంగా) నన్నా!

దామో: అవును.

సుజా : దేనికి తీసుకువెళతారు?

దామో: దేనికా? పిచ్చిదానా! అందమైన పిల్లవు. పైగా నువ్వో పెద్ద ఆస్తికి వారసురాలవు.

సుజా: నేనా !

దామో: యక్షప్రశ్నలు వేయకు. వెంటనే యిక్కడి నుండి పారిపో. వాళ్ళకు చిక్కితే నిన్ను సర్వం నాశనం చేయందే విడిచిపెట్టరు.

సుజా : అమ్మా! (పెద్దగా ఏడ్చింది)

దామో: యిప్పుడున్నదే కొద్ది సమయం. త్వరగా లే! పారి పోలేకపోతే అన్యాయమైపోతావ్ సుజాతా! నా మాట విను.

వెంక : (ప్రవేశించాడు.)

దామో: ఏం తాతా వాళ్లు వస్తున్నారా ?

వెంక : ఇంకా రావటంలేదు బాబూ! యింకా ఇక్కడ వున్నావేం ? అమ్మాయి వచ్చుకోలేదా ?

సుజా : (ఏడుస్తూ) వెంకన్నా ! (కళ్ళుమూసుకొంది.)

వెంక : ఏడవకమ్మా ! ఏడవకు ! నీ దురదృష్టానికి మా గుండెలు కుళ్ళిపోతున్నయ్. వాళ్ళు నీకు ద్రోహం చేయబోతున్నారు తల్లీ ! నువ్వు త్వరగాపారిపో ఇక్కడనుండి. ఇదిగో ! ఈ అబ్బాయి నీకు అండగా వుంటాడు. మంచి ప్రదేశంలో నిన్ను కాపాడతాడు. వెళ్ళమ్మా ! వెళ్ళు.

సుజా : మరి... మా నాన్న... మా నాన్ననుకూడ విడిపించండి. వెంకన్నా ఆయన చెడ్డవాడైనా నన్ను పెంచాడు. నా కోసం...

వెంక : సరేతల్లీ! ఎలా విడిపించాలి? అతనెవరో నేను చూళ్లేదు. పైన గదిలో బంధించి తాళాలు వైకుంఠం గారే దగ్గరుంచుకున్నారు.

దామో: తాతా! నువ్వు వాళ్ళొస్తున్నారేమో చూస్తూ ఉండు. సుజాతా నీవు రెడీగావుండు. నేను పైకివెళ్ళి గది తాళాంబద్దలుకొట్టి మీనాన్నను తీసుకొస్తానుపద.

వెంక : ఎట్లాబాబూ? ఈలోగా వాళ్ళొస్తే?

దామో: భయపడకు తాతా! యిదిగో ఇప్పుడే పోలీసు స్టేషనుకు ఫోన్ చేస్తాను. (గబగబా ఫోన్‌దగ్గరకువెళ్ళి డైల్‌చేసి) హల్లో! ఎవరది?...ఆ...దామోదరం స్పీకింగ్...వైకుంఠభవనం...బృందావన గార్డెన్‌లో వుందే...త్వరగారావాలిసార్! ఆ...అదే...అదే... చాల ప్రమాదం జరిగేలావుంది. వస్తానంటారా! త్వరగా రావాలి!...థాంక్సు... (ఫోన్ పెట్టేసి)

సుజాతా త్వరగా వెళ్ళు... వెంకన్నతాతా ఒక్క పురుగుని పైకి రానివ్వద్దు (గబగబా పైకి వెళ్ళాడు.)

సుజా : (లోపలికి వెళ్ళింది)

వెంక : (వాకిలిదాటి బయటకు వెళ్ళాడు.)

(కొద్దిక్షణాల తరువాత వైకుంఠం, సేట్, సదానందం, డాక్టరు అంతా గబగబా వచ్చారు. వెంకన్న వెనుకనే వచ్చాడు భయంగా.)

వైకుం: యిదిగో! వెంకన్నా! మన సామాన్లు సర్దివేయ్ త్వరగా!

వెంక : దేనికి బాబూ?

వైకుం: అడిగావూ! ఓరి అపశకునపు పక్షీ! నేను నిన్ను అడగ వద్దని చెప్పానా? ప్రయాణంలో ఉండగా ఎక్కడికి? ఎందుకు? ఏమిటి? అంటావేంరా? బుద్ధిలా! ఎన్నిసార్లు చెప్పాను! (అని లోపలికి వెళ్ళవలెను.)

వెంక : ఊరికి వెళ్ళుతున్నారా బాబయ్యా?

సేట్ : హారే హేమ్టిమాట అడిగావ్ జాన్వర్!

శివ: వాడికెట్లా తెలుస్తుందండి? మనం ఊరికి వెళ్ళుతున్నామో! బంధిపోటుకెళ్ళుతున్నామో?

సదా: కరెక్ట్ డాక్టర్! కరెక్ట్. మనచావు బ్రతుకులసమస్య మనకే తెలియదు. ఏనాడు ఈ దుర్గంధంలో కాలు పెట్టామో ఆనాడే మనం చచ్చామనుకో!

శివ : కరెక్ట్ మనం బ్రతికటంలేదని నేనూ తెలుసుకున్నాను.

వైకుం : (వచ్చి) ఊరుకోండి. పాడుసోది. ఆ...వెంకన్నా... సుజాతను యిలా రమ్మను.

వెంక : యిక్కడికా అండి ?

వైకుం : యిక్కడి కేరా మొద్దా ! పిలువు.

వెంక : పదిమంది పరాయివాళ్లుండగా తనను పిలవవద్దని చెప్పిందయ్యా !

వైకుం : అలా ఏడవరాదూ ! నేనే వెళ్ళి మాట్లాడుతాలే ! నువ్వు మేడమీదకెళ్ళి నా గుడ్డలు వగైరా సర్దు ! (లోపలికి వెళ్ళబోతూ ఆగి) ఆ... వద్దులే నేను వెళ్ళి సర్దుకుంటాను. నువ్వు వెళ్లి సుజాతను రెడీగా ఉండమని చెప్పు.

వెంక : కాదయ్యా ! నేను చెపితే ఆ పిల్ల ఎగిరి పడుతుంది. మీరే చెప్పండి నేను గుడ్డలు సర్దుతాను.

వైకుం : సరే కానివ్వు ! డాక్టర్ మీరు (నవ్వి) వరేయ్ వెంకన్నా యిదుగో ఈ రెండు యాపిలుపళ్ళు తీసుకు వెళ్లి ఆ పై గదిలో నున్న దౌర్భాగ్యుడికి యివ్వు !

వెంక : చిత్తం. దాని తాళపుచెవులు కావాలయ్యా !

వైకుం : ఆ... ఆ మాటే మరచాను. యివిగో (ఇచ్చి లోనికి వెళ్ళాడు.)

వెంక : (మెట్లు ఎక్కుతూ వుంటాడు)

శివ : (వచ్చి వెంకన్నను ఆపి) వెంకన్నా ! నువ్వుకాదు. యిలా తే వాటిని. నువ్వు వెళ్లి ఓ గోల్డుఫ్లాక్ సిగరెట్టు టిన్ను పట్టుకురా !

వెంక : అట్లా పోయి కూర్చోండయ్యా ! అయ్యగారి పనులన్నీ అయినాక అట్లాగే వెళ్లొస్తా !

శివ : అదికాదు వెంకన్నా !

వెంక : వెంకన్నకుకూడా కాస్త బుర్రుందయ్యా ! గోలచేయక ఎల్లి కూర్చోండి !

శివ : నౌకరు వన్నమాట మరిచిపోకు జాగ్రత్త. నాకు కోప మొస్తే మంచివాణ్ణికాడు. గనుక వెళ్లిరా ముందు.

వెంక : వెళ్ళనయ్యా! వైకుంఠంగార్కి నౌకర్నిగాని మీకు కాదయ్యా! కోపం రానివరకే ఈ వెంకన్న మంచితనం. మీరుపెట్టిన కష్టాలు గానుగెద్దులా మోసాను. మీరు తిట్టిన తిట్లు చెవిటివాణ్ణిలా భరించాను. మీరు చేస్తున్న గారడీని గుడ్డివాణ్ణిలా చూశాను. మీరు పెట్టుతున్న చిత్రహింసలు మోయలేక మోశాను. చాలు. నన్నేమీ ఆజ్ఞాపించకండి. యిక యీ వెంకన్న ఎవ్వడి ఆజ్ఞాపనలు వినడు మర్యాదగా వెళ్లి కూర్చోండి. లేదా వెళ్లి తెచ్చుకోండి.

శివ : ఓరి రాస్కెల్. ఎంతమారిపోయావురా? ఎంత హుంక రించావ్ స్కౌండ్రల్. నాకే నీతులు చెవుతావా? (చేయిఎత్తి వెంకన్నను కొట్టబోవలెను.)

దామో: (ధర్మన్నతో ప్రవేశించి) ఆగండి. చెయ్యిదించండి. లేకపోతే విరిగిపోతుంది.

శివ : నువ్వా! (నవ్వి) అందుకా ఈ వెధవ నన్ను పైకివెళ్ల వద్దని అటకాయించింది. మంచి గ్రధమే నడుస్తుందన్న మాట! వైకుంఠంగారూ! వైకుంఠంగారూ... సర్వ నాశనం... సర్వనాశనం జరిగింది.

వెంక : (ధర్మన్నను చూచి గుర్తుపట్టి) పిచ్చయ్యా! నువ్వా!
ధర్మ : (తుళ్లిపడి) ఎవరది ?
వెంక : పిచ్చయ్యా! బ్రతికేవున్నావా? నువ్వేనా ఇక్కడ బంధించబడింది. నీవు పెంచిన పిల్లలేనా వీళ్లు!
దామో: వెంకన్న తాతా! ఈ ధర్మన్న నీకు తెలుసా ?
వెంక : తెలుసయ్యా తెలుసు. యింతకాలం నేను వెతుకుతున్నది ఇతనికోసమే. యింతకాలం బ్రతికివుందీ ఇతనికోసమే. పిచ్చయ్యా! నన్ను... నన్ను గుర్తించలా? నేను... నేను...
ధర్మ : ఆగండి. వైకుంఠం వస్తున్నాడు.
వైకుం : (ప్రవేశించి చూచి) రాస్కెల్సు అంతా దారుణం చేస్తున్నారుగా ? నా యింట్లోనే, నా ప్రక్కలోనే నాకే ఈ వెధవలు ద్రోహం తలపెడతారా ! (చూచి నిర్ఘాంతపోయి) ఓహో అంతా ఒకచోట పోగయ్యారే?
సేట్ : హరె ! హేమ్టిమా చప్రాసికి తెచ్చావోయ్ ?
సదా : పట్టి లుచ్చా.
శివ : మోసగాడు.
దామో: మోసగాడు! ఎవరు మోసగాళ్లు? డబ్బుకోసం కక్కుర్తిపడి ప్రజల్ని వంచించినదెవరు? తండ్రిని బిడ్డను వేరుచేసినదెవరు? నిలువునా మనుష్యుల ప్రాణాలు తీస్తుందెవరు? మీరా? మేమా? మీఅంత్యకాలం సమీపించినది. మీరు ఒక్క అడుగు ముందుకు వేశారో మీ నాల్గుప్రాణాలు నా చేతుల్లో

రాలిపోతయ్! జాగ్రత్త! (పిస్టల్ తీసి గురిపెట్టాడు అందరికి.)

సుజా: (ప్రవేశించి అందర్నీ చూచింది)

వైకుం: దామోదరం! మర్యాదగా చెపుతున్నాను. వాళ్ళ కోసం నీవు అన్యాయంగా చావబోకు!

దామో: నా చావుని గురించి విచారించకండి. ముందు మీ పండినపాపాన్ని పరిహారం చేసుకోండి. ఒక్కక్షణంలో మీకు జైలు ప్రాప్తి కలగబోతోంది! సుజాతా నీవు వాళ్ళలో కలవబోకు. ఇవతలికి రా!

సుజా: ఏమిటండీ! ఏమిటిదంతాను? నేను రాను. నా కోసం మీరు యిట్లాంటి అఘాయిత్యం చేయకండి. నాకెవ్వరూ వద్దు. నేను చచ్చిపోతాను.

వైకుం: (గభాలున సుజాతను పట్టుకొని తన ముందు నిల బెట్టుకొని) యిప్పుడు చెపుతాను. మంచిగా చెపు తుంటే బరి తెగిపోతారూ? మీరు మర్యాదగా ఆ పిస్టలు క్రిందపారవేయండి. లేకపోతే పిస్టలుతీసి కాల్చి పారవేస్తాను.

సుజా: నా మాట వినండి. ఈ ఘోరం అంతా దేనికి? నాన్నా! వెంకన్నా! ఏమండీ! దేనికీ దౌర్జన్యం? నా కోసం మీరు చిక్కుల్లో పడకండి. (ఏడ్వవలెను.)

ధర్మ: నీ కోసం కాక యింకెవ్వరికోసం? నిన్ను ఈ రాక్షసుల కప్పగించి ఊరుకొంటామా?

సుజా : వైకుంఠంగారూ ! మీరన్నా ఊరుకోరూ? నా కోసం ...నా కోసం మీరే ఉపకారం చెయ్యండి. వాళ్ళ నేమీ అనకండి (ఏడుస్తూ అడ్డుగా నిలబడుతుంది)

వైకుం : సుజాతా ! లే ! అడ్డులే ! ఈ వెధవల్ని శలభాల్లా మాడ్చి పారవేస్తాను. (పిస్టల్ తీయబోవలెను.)

ఇన్ : (ఇద్దరు పోలీసులతో ప్రవేశించి) ఆగండి పిస్టలు పేలిందా? ... జాగ్రత్త !

వైకుం : (వెనుతిరిగి) యిన్స్పెక్టరుగారా ! రండి ఈ వెధవలు నా కొంపలో జేరి నానాభీభత్సం చేస్తున్నారు.

ఇన్ : (అందర్నీ) ఏమిటిదంతాను ?... చెప్పరేం ?

దామో: చెప్పాలా? చెప్తాను. యిదిగో ఈపిల్లను దొంగతనంగా తీసుకవచ్చి, ఈ పెద్దమనిషి తన కుమార్తెకోసం వస్తే, తన్ని బలవంతానా ఈ ముఠా అంతా గదిలో బంధించారు.

వైకుం : అబద్ధం ! సర్వాబద్ధం ! ఈ పిల్లతండ్రి అతనుకాదండి.

ఇన్ : ఏం అమ్మాయి నిజమేనా ?

సుజా : నిజమేనండి. నా తండ్రి చనిపోయాడు. నా తల్లి దండ్రుల్ని ఈయనే చంపాడనికి వైకుంఠంగారు చెప్పారు.

వైకుం : అవును సార్.

సేట్ :<br>
సదా : } మేమంతా చూశాము.<br>
శివ :

ఇన్ : (ధర్మన్నతో) నిజమేనా ?
ధర్మ : నేను చంపలేదండి.
వైకుం : నేను రుజువు చేస్తాను. యితను ఒక నౌకరు. యజమానివద్ద వుంటూ, అతని గుట్టుమట్టులు తెలుసుకొని ఓ నాటిరాత్రి ఆ కుటుంబానంతా చంపి ఆస్థి సర్వస్వం దోచుకొని యజమాని పిల్లల్ని తీసుకొని పారిపోయాడు.
ఇన్ : (తెలియనట్లు) అలాగా !
దామో : లేదండి యిన్స్పెక్టరుగారూ! ఈ దుర్మాన్గుల మాటలు నమ్మకండి. మరి ఈ పిల్ల తండ్రి పేరేమిటి?
వైకుం : రామచంద్రరావు గారండి! ఆయన చనిపోకముందు బోలెడంత డబ్బు మా దగ్గర తీసుకున్నాడు. అందుకు ఈ యిల్లు మాత్రం స్వాధీనపు దస్తావేజు వ్రాసి యిచ్చాడు.
వెంక : అబద్ధం యిన్స్పెక్టరుగారూ! ఆ రామచంద్రరావు చనిపోలేదు. ఈ కల్పిత గాధను నమ్మకండి. ముందు ఈ దుర్మార్గుల్ని అరెస్టు చేయండి. నేను చెపుతాను యదార్థం !
ఇన్ : నువ్వా !
వెంక : అవును సార్ నేనే.
వైకుం : ఓరి స్కౌండ్రల్! ఏమిట్రా పేలుతున్నావ్ ? (వెళ్ళి కొట్టబోతూవుంటే పోలీసులు పట్టుకున్నారు.)
ఇన్ : చెప్పండి. ఫరవాలేదే.
వెంక : వ్రాసుకోండి చెపుతాను. ఈ భవనం రామచంద్రరావనే జమీందారుది. రంగాపురం వారి స్వగ్రామం.

ఆ జమీందారు ఓసారి ఈ పట్నం ప్లీడరుగారింటికి వచ్చాడు. అప్పుడే ఈ వైకుంఠం వారికి పరిచయ మయ్యాడు.

ఇన్ : (వ్రాసుకొని) అవునా వైకుంఠంగారు ?

వైకుం : (మాట్లాడడు. నిర్ఘాంతపోయి చూస్తూఉంటాడు.)

వెంక : ఈ వైకుంఠం పెద్దమనిషిగా నటించి' ప్లీడరుగారి ద్వారా మెల్లగా రామచంద్రరావుగారి వద్ద పర్సనల్ శక్రటరీగా ఉద్యోగం సంపాదించాడు. అక్కడనుండి ఆ జమీందారుని బుద్ధిహీనుణ్ణిచేసి, అతని మానసిక మైన దురలవాట్లు రెచ్చగొట్టి ఆస్పత్రిలోకి [illegible] ఈ భవనంకూడ అప్పుడు కట్టిందే.

ఇన్ : (వ్రాసుకొని) అవునా ?

వైకుం : నిజమేనండి.

ఇన్ : తరువాత.

వెంక : ఈ యింట్లోకి చేరాక తానొక పెద్ద వ్యాపారం చేస్తానని, దానికి అమితమైన లాభాలొస్తాయని రాత్రింబవళ్ళు వేధించసాగాడు. అప్పుడు ఆ జమీందారు వద్ద ఉంటూవున్న ఈ పిచ్చయ్య దొరగారితో యిలాంటి వాటిల్లో దిగవద్దని, తొందరపడి అలాంటి వ్యాపారాలు చేయటం మంచిది కాదని చెప్పాడు.

ఇన్ : (వ్రాసుకొని) ఆ వ్యాపారం ఏమిటి ?

వెంక : ప్రభుత్వ లైసెన్సు లేకుండా సుగంధ ద్రవ్యాలను ఒక రాష్ట్రం నుండి మరొక రాష్ట్రానికి చేర్చటం. మత్తు పదార్థాలు దిగుమతి చేయటం.

ఇన్ : (వ్రాసుకొని) అలాంటి వ్యాపారానికా జమీందారు డబ్బు పెట్టుబడి పెట్టాడా ?

వెంక : లేదు. మొదట యిన్సూరెన్సు కంపెనీ అని చెప్పారు. దానికోసం పదిలక్షలు యిమ్మన్నారు. ఆ జమీందారు అమాయకుడై వాళ్ళమాటలు నమ్మాడు. కాని అతని నౌకరైన ఈ పిచ్చయ్య వాళ్ళ దొంగ సర్టిఫికేట్లు, ముద్రలు ఎలా సంపాదించి మోసం చేస్తున్నదీ ఆ జమీందారుకు తెలియ చెప్పాడు. అప్పుడు బ్యాంకులోనుండి తెచ్చిన డబ్బు తిరిగి తీసుకొని వెళ్ళటానికి వీల్లేకపోయినది. ఈ వైకుంఠం వచ్చి డబ్బడిగితే జమీందారు యివ్వనన్నాడు. డబ్బు ఇవ్వనందుకు వైకుంఠం కోపగించి బెదరించి వెళ్లాడు. రాబోవు ప్రమాదం ఊహించి ఈ పిచ్చయ్య ఆ జమీందారుకు చెప్పాడు. ఎందుకైనా మంచిదని ఆ పదిలక్షల ధనాన్ని ఈ పిచ్చయ్య చేతికిచ్చి బయట ఎక్కడన్నా దాయమని పంపించేశాడు. కాని అప్పటికే ఈ రౌడీలు యింటిచుట్టూ పొంచివున్నారు. అది గ్రహించి పిచ్చయ్య తిరిగివచ్చి ఆ డబ్బంతా జమీందారుకిచ్చాడు. విషయం తెలుసుకొని, పరిస్థితులు విషమించాయని ఈ యింట్లోనే ఆ వెనుకవైపున వున్న గోడ క్రింద గొయ్యి తవ్వి పాతేసి కూర్చున్నాడు. అప్పటికి రాత్రి 12 గంటలయినది. యీ దుర్మార్గుడి రౌడీలు యింటిమీద విరుచుకుపడ్డారు అద్దాలు తలుపులు పగలగొట్టి లోపల జొరబడ్డారు.

మొట్టమొదటి ఎదురుగా వచ్చిన జమీందారు భార్యను చంపివేశారు. యీ పిల్లతోపాటు ఇంకో ఆడపిల్లను తీసుకొని యీ పిచ్చయ్య తెలివిగా తప్పించుకొని పారిపోయాడు. యీ పిచ్చయ్య భార్యా, ఓ ఆరేళ్ళకొడుకూ అక్కడే వున్నారు. వాళ్ళను కూడా......

ఇన్ : (వ్రాసుకొని) చంపేశారా?

ధర్మ : లేదు. నా భార్య ఎలాగో తప్పించుకు వచ్చింది. కాని నా కొడుకు మాత్రం ఆ గందరగోళంలో తప్పించుకొని ఏడుస్తూ పోయాడు. వాడింతవరకూ నా కంటికి కనుపించలేదు. వాడు చనిపోయాడో, బ్రతికే ఉన్నాడో తెలియదు. (కన్నీరు కార్చాడు)

ఇన్ : (వ్రాసుకొని) ఆ జమీందారు చనిపోయాడా?

వెంక : లేదు. ఈ దుష్టుల, క్రూరుల పైశాచిక రాక్షసుల చిత్రహింసలన్నీ భరించినా చివరకు బాగా కొట్టారు. చివరకు చనిపోయాడని ప్రక్కనున్న నదిలో పార వేశారు. దురదృష్టవశాత్తు పారవేసినవారు నదిలో పారవేయలేదు. వడ్డువవేసి యింతలో చుట్టుప్రక్కల జనం వస్తున్నారని పారిపోయారు. ఆ జమీందారుని ఓ పేదవాడు తీసుకవెళ్ళి కాపాడాడు. ఆ పుణ్యాత్ముడి దయవలన బ్రతికి మారువేషంలో మరల నిమిది సంవత్సరాలు అజ్ఞాతంగా బ్రతికి చివరకు ఈ నౌకరు వెంకన్నగా వచ్చి మీముందున్నాడు.

ధర్మ : బాబూ! మీరా? (కాళ్ళమీదబడ్డాడు ఏడుస్తూ)

వెంక : పిచ్చయ్యా! (కౌగలించుకొని) విచారించకు నీకోసమే బ్రతికిఉన్నా. ఏనాటికైనా పిల్లల్ని చూస్తానని, నిన్ను కలుసుకుంటానని. ఈ పాపకర్మల్ని......

ధర్మ : అమ్మా సుజాతా! మీ నాన్నగారమ్మా! వీరే మీ నాన్నగారు. నా యజమానిగారు.

సుజా : (సంతోషంతో) నాన్నా! నాన్నా! (వెళ్ళి హృదయం మీదవాలి ఏడుస్తుంది.)

వెంక : ఏడ్వకమ్మా, ఏడవకు.

ఇన్ : ఏయ్! ఈ రాస్కెల్సుని అరెస్టు చేయండి.
(పోలీసులు అందర్నీ అరెస్టుచేసి సంకెళ్ళు వేస్తూ ఉంటారు.)

మాధవయ్య : (ప్రవేశించి) ఓరి నా ముద్దులయ్యా! నీకోసం ఎంత వెదికానయ్యా! కళ్ళు, కాళ్లు పోయినైయయ్యా! నేనేం తప్పుచేసానని పారిపోయివచ్చావయ్యా! నా పైన దేనికొచ్చిందిరా కోపం నా చిన్నయ్యా!

దామో: ఛల్లే! ఊరోకో. ఏమిటాసోది? నీ సోదిపడలేకనే పారిపోయివచ్చాను. యిక్కడన్నా సుఖంగా బ్రతక నీకుండా యీ పోరు మళ్ళా వచ్చిందా?

మాధ: అన్నావా ఆమాటయ్యా? ఓ రెండుసంవత్సరాలకు పూర్వం యీ పిల్లాడు దిక్కులేక రోడ్లమీదపడి ఏడుస్తావుంటే ఓ రాత్రిపూట జాలేసి తీసుకెళ్ళి

భద్రంగా పెంచాను. చూడండయ్యా పెంచినప్రేమ, కన్నప్రేమకన్నా మిన్నగాదయ్యా?

దామో: సరే పెంచావు లేవెళ్ళు.

ధర్మ: అలాకాదు బాబూ! వారు చెప్పింది నిజమే! కన్న ప్రేమకన్నా, పెంచినప్రేమ చాలగొప్పది. వారిని దుఃఖ పెట్టకు.

మాధ: యీ తావళంతీసి పారవేశావు. నీకు గాలి పట్టుకుంది. యిల్లొదిలి వీధిని పడ్డావు. నిన్ను వెదకలేక చస్తున్నానయ్యా! రా నా చిన్నయ్యా! నిన్ను విడిచి బ్రతకలేనయ్యా! (అని తావళం కట్టబోతాడు)

దామో: (తావళాన్ని లాక్కొని విసిరి పారవేశాడు. అది ధర్మన్న కాళ్ళదగ్గరపడింది.)

ధర్మ: (అందుకొని) తప్పు నాయనా ఈ తావళం (ఆగి బాగా చూచి ఆశ్చర్యంగా) నాయనా ప్రభాకరం... ప్రభాకరం ఈ తావళం నేను కట్టిందేరా! నువ్వు నా బిడ్డవేరా! (వెళ్ళి కౌగలించుకున్నాడు.)

[అందరూ ఆశ్చర్యంగా చూస్తారు.]

మాధ: అవునయ్యా! చిన్నప్పుడు అతనిపేరు నాతో చెప్పింది ప్రభాకరమేనయ్యా! ఆ తావళం అతని మెడలోనే ఉందయ్యా! సరేనయ్యా! కన్నతండ్రివి నువ్వు దొరికావు. యిక నన్ను లెక్కచేయకయ్యా! నీ బిడ్డను నీవు జాగ్రత్త పెట్టుకో అయ్యా! మరి నా కొడుకా వెయ్యేళ్ళు వర్ధిల్లవయ్యా! నే వస్తానయ్యా! యీ

సభాసదులకు నమస్కారమయ్యా! నాకు శెలవు యిప్పించండయ్యా! (మెటికలు విరుస్తూవయ్యారంగా వెళ్ళిపోతాడు. అంతా నవ్వుతారు.)

ఇన్ : వస్తామండి. మీరు రేపు స్టేషనుకు రండి.

వెంక : అలాగే సార్.

ఇన్ : పదండి, పదండి. (పోలీసులు లాక్కొని వెళ్ళుతూవుంటే అందరూ ఆనందంగా ఒకళ్ళు ముఖంలోకి వకళ్లుచూచి నవ్వుకుంటారు.)

[ తెర ]